# సిద్ధాంతము:

## అసలైన పార్లే గ్లూకో బిస్కట్ వైపుకు అడ్డదారిలో చేరేందుకు మార్గం దాని పేరు ద్వారానే.






పార్లే గ్లూకో పార్లే మొనాకో పార్లే క్రాక్‌జాక్

# మూల సిద్ధాంతము: కరకరలాడే గుణం తాజాదనాలతో పాటు ప్రజాభిమానం చూరగొన్నవిగనక పార్లే బిస్కట్లకు నకిలీవిచేసే వారెందరో ఉన్నారు.

దీనిని ఋజువు చేసేందుకు : మీరు పార్లేలా కనిపించే బిస్కట్‌ని తయారుచేయొచ్చేమోగానీ, అదే రుచిగల బిస్కట్‌ని మాత్రం కాదు.

ఋజువు : ఎ) పేరు చూసి పరీక్ష :
పేరు ఎలా పలకబడుతుందో చూడండి. అది P-A-R-L-E యేగానీ P-E-A-R-L లేక P-E-R-L-E కాదన్నది నిర్ధారించు కోండి. ఒకవేళ G-L-U-C-O అయితే G-L-U-C-O-S-E కాదన్నది చూడండి. అసలు మీరు పార్లే గ్లూకో బిస్కట్లను విడిగా కొనాలనుకుంటే అసలైన పార్లే గ్లూకో అని నిర్ధారణ కొరకు బిస్కట్‌పై పేరు ఎలా పలకబడుతుందన్నది చూసి గ్రహించండి.

బి) ప్యాకేజ్ పరీక్ష :
రంగురంగుల ప్యాక్‌పై చిత్రింపబడే పార్లే పాపాయి ఉన్నదో లేదో చూడండి. శ్రేష్టమైనది అన్నదానికి అది మీ హామీ.

సి) రుచి చూసి పరీక్ష :
బిస్కట్‌ని కాస్త కొరికి చూడండి. దానికి కరకరలాడేగుణం, తాజాదనం ఉంటే అది అసలైన పార్లే గ్లూకో బిస్కట్ అని మీరు నిర్ధారణ చేసుకోవచ్చు.

ఋజువు కాబడింది




# వీటన్నిటినీ కలిపి కూడితే వచ్చేది బిస్కట్లు ఇచ్చే మహదానందం.

everest/79/PP/451-tl

# శత్రు సంహారం!







బినాకా-ఎఫ్ సవాలును అందుకున్నారు.




దంత ప్రదేశంలోని సేనాదళం,
రాత్రింబవళ్ళు తరిఫీదుతో
యుద్ధానికి సంసిద్ధులయ్యారు.



సోమవారం, డిసెంబర్
ద, కళగ, చీకటి మాటున
దంత భక్షకుడు
దాడి చేసాడు.







కాని బినాకా-ఎఫ్, వారితో దంత ప్రదేశంలోని
సైనికులూ కలిసి, తిప్పికొట్టారు.



పరుగెత్తండి! మనం చచ్చాం యింక!









దంత ప్రాంతపు సేనలకి
మహా విజయం!

మేలైన ఆయుధాలూ, తరిఫీదూ
వల్ల విజయం వచ్చింది. అంటే, బినాకా
ఫ్లోరైడ్, బినాకా టూత్ బ్రష్‌కి.







కార్బొక్సిల్ ఏసిడ్ గ్రూప్ ఫార్ములా—
పళ్ళ ఎనామెల్‌ను నల్లపరచి, బాధను
కలిగించే పిప్పి పళ్ళను కలిగించేది.

గట్టి పళ్ళకోసం, పిప్పిపళ్ళు రాకుండా
నిరోధించడంకోసం—బినాకా ఫ్లోరైడ్.

# విజయా బ్యాంక్ సహకరించే విధానము- మీ బాబు తన జీవితంలో ఉత్తమ వస్తువులను పొందటానికి.



విజయా బ్యాంక్ 3 మార్గాలు సూచిస్తుంది ఆతడి ఆశలు తీర్చడానికి

## 1. బాల నిధి డెపాజిట్ స్కీము:

బాబు తనకు కావలసిన చిన్న చిన్న వస్తువులు కొనుక్కోడానికి ఆదా చేసే ఆనందాన్ని బోధిస్తుంది–ఒక చేతి గడియారము ఒక కెమేరా, లేక ఒక క్రికెట్ బ్యాటు వంటివి. ప్రతిరోజూ ఆదా చేసే డెయిలీ సేవింగ్సు స్కీము విధానంలో విజయా బ్యాంక్ వారు ఒక రూపాయికంటె తక్కువ డిపాజిటులకు కూడా అంగీకరిస్తారు- బ్యాంక్ వారే మీ ఇంటికి వచ్చి వసూలు చేసుకుంటారు.





## 2. విజయా ఎడ్యుకేషన్ ప్లాన్: 'A'

ఈ పథకము మీ పిల్లవాని ఉన్నత విద్యాభ్యాసాలకు ఉపకరిస్తుంది. ఈ ప్లాన్ (ఎ) ప్రకారము ఇప్పుడు వెంటనే మొత్తం సొమ్ము కొంత కట్టేస్తారు-తరువాత మీ బాబుకి 15 సంవత్సరాలు దాటి కాలేజీలో



చేరినప్పటి నుంచి 7 ఏళ్ళపాటు నెలనెలా రూ. 100/-లు లభిస్తుంది.

## 3. విజయా ఎడ్యుకేషన్ ప్లాన్: 'B'

మీరు ఒకేసారిగా కొంత మొత్తం కట్టడంకంటె చదువుల కొరకు, చిన్నప్పటి నుంచి ప్రతీ నెలా కొంతసొమ్ము ఆదా చేయడం ఆరంభిస్తారు, ఈ పథకం మీకు చాలా అనుకూలంగా వుంటుంది. మళ్ళీ ఇక్కడ కూడా మీ బాబుకి 15 ఏళ్ళు వచ్చేసరికి బ్యాంక్ వారు ప్రతీ నెలా రూ. 100/-లు చొప్పున 7 ఏళ్ళపాటు ఇస్తారు.

వివరాలకు విజయా బ్యాంక్ కి విచ్చేయండి. మీ టెలిఫోను డైరక్టరీ ఒక్కసారి చూడండి—మీకు దగ్గరగా మా బ్రాంచి ఉండకపోదు.



# విజయ బ్యాంక్ లిమిటెడ్

రిజిష్టర్డ్ ఆఫీస్: లయిట్ హౌస్ హిల్ రోడ్, మంగళూరు-575003
అడ్మినిస్ట్రేటివ్ ఆఫీస్: 2, రెసిడెన్సి రోడ్, బెంగళూరు-560025

OBM: 4981 TG



# చందమామ

జనవరి 1980



ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు






విడి ప్రతి: 1-50

సంవత్సర చందా: 18-00




# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ ["రుజువు కాని నేరం"] బంధకవి సరోజినీదేవి రచన. ఉన్నత పదవులలో ఉన్నవారికి అదనంగా డబ్బు సంపాదించుకునే అవకాశాలు జాస్తి. అలాటివారు తమ రాబడి మించి ధనికులైతే వాళ్ళు లంచగొండులని పేరు వస్తుంది. కాని లంచం వేరు, బహుమానాలు వేరు.

## అమరవాణి

దుర్జనైస్సహ సంపర్కః శత్రుతాపి న యుజ్యతే;
గృహీతే దహ్యతేంగారే, శాంతే కృష్ణాయతే కరః..

[దుష్టులతో స్నేహమూ, వైరమూ కూడా తగనివే. బొగ్గు కణికలు పట్టుకుంటే చెయ్యి కాలుతుంది; చల్లబడినవైనా చెయ్యి నల్లగా అవుతుంది.]

సంపుటి 66 జనవరి '80 సంచిక 1

విడి ప్రతి : 1-50 : : సంవత్సర చందా : 18-00




కె. ఎస్. ఆర్. ఆంజనేయులు, -గుడివాడ.

ప్ర: శివుడి నెత్తిన ఎప్పుడూ అర్ధచంద్రుడు ఉంటాడు. పూర్తి చంద్రుడు ఎందుకు ఉండడు?

న: శివుడి నెత్తిన ఉండేది అర్ధచంద్రుడు కూడా కాదు, చవితిచంద్రుడు. చవితిచంద్రుడు వినాయకుడికి సంకేతం. శివుడికీ, వినాయకుడికీ మనం గుర్తించే సంబంధం అలా ఉంచి, శివుడిలో అనేక ఆరాధ్య దైవాలు కూడుకున్నాయి—పాముా, గంగా, వినాయకుడూ, ఇవన్నీ తొలిగా వేరు వేరు ఆరాధ్య దైవాలు. శివుడిలో సగం భాగమైన పార్వతీ, శివుడి వాహనమైన ఎద్దూ కూడా ఒకప్పుడు శివుడి ప్రమేయం లేకుండా పూజించబడినవే.

అడపాల గోపాలరెడ్డి, మహమ్మదాపురం.

ప్ర: దక్షిణార్ధ గోళంలో నున్న వారికి ధ్రువనక్షత్రం కనిపిస్తుందా? కనిపించక పోతే వారికి రాత్రిపూట దిక్కు తెలిసి కొనుటకు ప్రకృతిసిద్ధమైన ఆధారము ఏది?

న: భూమధ్యరేఖకు దక్షిణంగా ఉండే ప్రాంతాలలో ధ్రువనక్షత్రం కనబడదు. దక్షిణాకాశంలో "ధ్రువ" నక్షత్రం లేకపోయినా, దక్షిణదిక్కును సూచించే కాంతివంతమైన నక్షత్రాలు చాలా ఉన్నాయి.

జి. వీరభద్రరావు, రాజమండ్రి.

ప్ర: ఇంద్రజాలికులు చూపేదంతా పట్టి బూటకమని తెలిసుండి కూడా వారు చూపించే ప్రదర్శనలు నిజమని నమ్మి భ్రమపడుతూంటాము. కారణమేమిటంటారు?

న: ఇంద్రజాలికుల ప్రదర్శనలలో పెద్ద ఆకర్షణ అబద్ధం, ముమ్మూర్తులా నిజం లాగుండటమే. నాటకాలూ, సినిమాలూ నిజంకావని తెలిసి కూడా చూడమా?

జొన్నలగడ్డ రాజకుమారి, భువనేశ్వర్.

ప్ర: త్రాచుపాముని మరో త్రాచు కరిస్తే అది చస్తుందా?

న: ఈ ప్రశ్న తప్పు. ఒక త్రాచు విషం ఇంకో త్రాచును బాధిస్తుందా అని ఉండాలి. బాధిస్తుంది! (సమాధానం ఇచ్చినవారు: హారీ మిల్లర్, F. Z. S. మద్రాసు)




## 79

పగతీర్చుకున్న కోతి కథ విని అత్యంత లోభి ఇలా అన్నాడు:

"నీ మాట నిజమే. దురాశాపాశాలలో చిక్కుకున్న మనుషులు కష్టాలు పడటమో, అవహేళన పొందటమో తప్పకుండా జరుగుతుంది. అయితే ఈ సంగతి వారికి అంతా మించిపోయేదాకా తెలిసిరాదు," అన్నాడు.

"అలా అనకు, మిత్రమా. నేను నిన్ను ముందే హెచ్చరించాను. అయినా నువు, గానం చేసిన గాడిదలాగా, నా మాట ఏ మాత్రం వినిపించుకున్నావు కావు," అంటూ అతిలోభి గానం చేసిన గాడిద కథ ఇలా చెప్పాడు:

ఒకప్పుడు ఉద్ధతమనే గాడిద ఉండేది. అది పగలు తన యజమాని అయిన చాకలి బట్టలు మోసి, రాత్రిపూట స్వేచ్ఛగా తిరిగేది. అది అలా పొలాల వెంట తిరుగుతూ ఒక నక్కతో స్నేహం చేసింది. అవి రెండూ జతగా రాత్రివేళ ఒక దోసచేను ప్రవేశించి, తెల్లవార్లూ దోసకాయలు తిని, తెల్లవారేవేళకు తమ తమ నివాసాలకు వెళ్ళిపోయేవి.

ఒక రాత్రి గాడిద దోసకాయలు తెగ తిని మదించి, చేను మధ్యనిలబడి, నక్కతో, "అల్లుడూ, వెన్నెల ఎంత ఉల్లాసకరంగా ఉన్నదో చూడు! అందుకని నేను పాడబోతున్నాను. నీకు యిష్టమైన ఏ రాగం పాడమంటావో చెప్పు," అన్నది.

"మామా, మనం చేస్తున్నది దొంగపని. అలాటి విషయాలు చర్చించి ఏం లాభం? జారులూ, చోరులూ రహస్యంగా వ్యవహరించాలి. శ్వాసకోశ వ్యాధులు



గలవాళ్ళూ, నిద్రమత్తు గలవాళ్ళూ దొంగ తనానికి పనికిరారుట! పైపెచ్చు, నీ సంగీతం ఏమంత శ్రావ్యంగా ఉండక పోగా, శంఖారావంలాగా చాలా దూరం వినిపిస్తుంది. అది విని చేను కాపలావాళ్లు నిద్రలేచి వచ్చి నిన్ను పట్టవచ్చు, చావ గొట్టనూ వచ్చు. అందుచేత నా మాటవిని, నీ పాటకచేరీ ఆలోచన వెంటనే కట్టిపెట్టి, తినగలిగినన్ని దోసకాయలు తిను,'' అన్నది.

అందుకు గాడిద, "నువు అడివి ప్రాణివి. నీకు సంగీతం విలువ ఎలా తెలుస్తుంది? నీ మాటలనుబట్టే ఆ మాట తెలుస్తున్నది. ఆప్తుల మధ్య ఉండి శ్రవణానందకరమైన సంగీతం వినేవారు చరితార్థులని చెబుతారు. ఈ స్వల్ప విషయం కూడా నీకు, తెలియదు,'' అన్నది.

"మామా, నీ మాట నిజమే కావచ్చు కాని నీకు సంగీతం రాదే! కర్ణకఠోరంగా ఓండ్ర పెట్టటమే నీకు తెలిసినది. మన పని పాడు. అయే పనికిమాలిన పని చెయ్యా నేల?'' అన్నది నక్క.

"ఛీ, మూర్ఖుడా! నాకు పాడటం రాదని ఎవరన్నారు? విను, స్వరాలు ఏడు; స్థాయిలు మూడు: మూర్ఛనలు ఇరవై ఒకటి; రాగాలు ముప్పైఆరు; భావాలు నలభై. భరతులవారు రాసిన గాన శాస్త్రంలో 185 అధ్యాయాలున్నాయి. ఆయన సిద్ధాంతం ప్రకారం వేదాలు తప్ప సంగీతాన్ని మించినది లేదు. తన స్నాయువులను ఎండబెట్టి, తంత్రులుగా చేసి సంగీతం పుట్టించి, రావణుడు శివుణ్ణి సంప్రీతుణ్ణి చేశాడు. కనక, అల్లుడూ, నాకు సంగీతం గురించి తెలియ దని ఎలా అన్నావు? పాడవద్దని నన్ను ఎందుకు నిరుత్సాహపరుస్తున్నావు?'' అన్నది గాడిద.

"మామా, నువు పాడాలని పట్టుబట్టితే, నేను కంచలో తెరిపి వద్దకు వెళ్ళి, చేను గలవాళ్ళు యిటుకేసి వస్తారేమో చూస్తూ

ఉంటాను. తరవాత నీ చిత్తం వచ్చినట్టు గానం చెయ్యి.'' అన్నది నక్క వెళ్లిపోతూ.

తరవాత గాడిద పాట ఎత్తుకున్నది. అది భయంకరంగా ఓండ్ర పెట్టటం విని, చేనుగలవాడు కోపంతో పళ్ళు కొరుకుతూ, దుడ్డుకర్ర తీసుకునివచ్చి, గాడిదను చావ బాదేసరికి, గాడిద ప్రాణం కడబట్టి, అక్కడే పడిపోయింది.

చేనుగలవాడు గాడిద మెడకు ఒక పెద్ద బండరాయి కట్టి, దోసకాయలు తినటానికి వచ్చే ఇతర మృగాలను పట్టుకుందామని, చేనులోనే పడుకుని నిద్రపోయాడు.

గాడిద త్వరలోనే స్పృహ తెచ్చుకుని, మెడకు కట్టిన రాయితోసహా లేచి, కంచె దాటి పారిపోయింది.

నక్క దాన్ని దూరానే చూసి, బాగా పాడావు, మామా. నేను వద్దన్నా పాడటం మానావు కావు. నీ సంగీతానికి మెచ్చి నీ మెడకు కట్టిన రత్నం గొప్పగా ఉన్నది.'' అన్నది.

సంగీతం పాడిన గాడిద కథ విని అత్యంతలోభి, ''నిజమే, ఇప్పుడు నేను కూడా తెలుసుకున్నాను. తనంతట ఆలోచించలేనివాడు మిత్రుడి మాట అయినా వినాలి. లేకపోతే అనుభవిస్తాడు అయితే నా బోటివాడికి ఆ జ్ఞానంకూడా ఉండదు;



ఫలించని తన ఊహలతో ఎగిరిపోయి, చేతికి అందిన దాన్ని కూడా పోగొట్టుకుంటాడు. ఈ సంగతి 'గాలి మేడలు' అన్నకథ స్పష్టం చేస్తుంది,'' అని ఆ కథ ఇలా చెప్పాడు :

ఒకానొక పట్టణంలో స్వభావ కృపణుడు అనే బ్రాహ్మణుడు ఉండేవాడు. ఒకసారి ఏదో అక్కర జరిగితే ఎవరో అతన్ని భోజనానికి పిలిచి, కడుపు నిండా తిండిపెట్టి, కుండెడు పేలపిండి ఇచ్చారు. మిట్టమధ్యాన్నం వేళ ఇంటికి తిరిగివస్తూ, అతను ఒక మర్రిచెట్టు నీడన విశ్రమించి పిండి ఉన్న కుండను దిగువన ఉన్న కొమ్మకు కట్టి, దాన్నే

చూస్తూండగా, చల్లగాలికి కొంచెం కునుకు పట్టింది. ఆ స్థితిలో అతను గాలిమేడలు ఇలా నిర్మించసాగాడు:

"కరువు రావటమే జరిగితే—ఎందుకు జరగకూడదు?—ఈ కుండెడు పిండిని నూరు వెండి కాసులకు అమ్ముతాను. ఆ డబ్బుతో రెండు ఆడమేకలు కొనవచ్చు. ఆరు నెలల కొకసారి అవి ఈనుతాయి. త్వరలోనే మేకలమంద తయారవుతుంది. వాటిలో కొన్నిటిని అమ్మి ఆవులను కొంటాను. ఆవులు ఏటా ఈనుతాయి. కొన్ని ఆవులనూ, దూడలనూ అమ్మి గేదెలను కొంటాను. గేదెలమంద తయారవుతుంది. కొన్ని గేదెలను అమ్మి ఆడగుర్రాలు కొంటాను. వాటికి పిల్లలుపుట్టి, గుర్రాల మంద తయారవుతుంది. గుర్రాలు అమ్మగా వచ్చిన బంగారంతో దివ్యమైన భవనం కట్టించి, చుట్టూ అనేక గదులూ, మధ్యలో మండువా ఉండేలాగు చేస్తాను. నా వైభవం చూసి ఎవడో బ్రాహ్మణుడు అందమైన తన కూతురిని నాకు కన్యాదానం చేస్తాడు. పదినెలల కల్లా నా భార్య ఒక కొడుకును కంటుంది. వాడికి సోమశర్మ అని పేరు పెట్టుతాను. వాడు ప్రాకుతూండే దశలో నేను పుస్తకం తీసుకుని, అశ్వశాల వెనక చదువుకుంటూంటాను. సోమశర్మ నన్ను చూసి తన తల్లి ఒడి నుంచి, నా కేసి పాకుతూ రావటంలో గుర్రపు గిట్టలకు దగ్గిరగా వస్తాడు. నేను కోపంగా, 'పిల్లవాణ్ణి తీసుకో! పిల్లవాణ్ణి తీసుకో!' అని నా భార్యమీద అరుస్తాను. ఆమె ఇంటి చాకిరిలో నిమగ్నురాలై ఉండి నా మాట వినిపించుకోదు. అప్పుడు నేను లేచి ఆమెను కోప్పడుతూ, కర్రతో ఇలా కొట్టుతాను!..."

బ్రాహ్మడు తన కర్రతో గట్టిగా కొట్టేసరికి కుండ కాస్తా పగిలి, వందముక్కలై పోయి, అందులోవున్న పేలపిండి అంతా ఒలికిపోయింది. దానిలో కొంతభాగం బ్రాహ్మణుడి నెత్తినా, భుజాల మీదా పడింది.





# భల్లూకమాంత్రికుడు

## 19

[రాజు జితకేతుడు, మర్కటుడి మంత్రదండాన్ని తెచ్చినవారికి తాను దత్తు చేసుకోబోతున్న కన్యతోపాటు, అర్ధరాజ్యం యిస్తానని ప్రకటించాడు. మాయామర్కటుడు కోటగోడ పైకి రావటం చూసి, ఏనుగు మీద వున్న ఆటవికుడు అతణ్ణి బాణంతో కొట్టాడు. మర్కటుడు కోపంగా ఆ బాణాన్ని కాళీవర్మ, భల్లూకమాంత్రికుల కేసి విసిరాడు. తరవాత—]

బాణందెబ్బ తినకముందు మాయా మర్కటుడు, నా మంత్రదండం ఎక్కడ? అంటూ పెట్టినకేక భల్లూకమాంత్రికుడితో పాటు, అందరూ విన్నారు. భల్లూక మాంత్రికుడు ఎక్కడలేని ఆశ్చర్యంతో, "శిష్యా, కాళీవర్మా! ఆ మర్కటుడి కేక విన్నావు గదా? నీకేం అర్థమవుతున్నది? నా నుంచి వాడు దొంగిలించిన మంత్ర దండాన్ని, వాడు ఎక్కడో పారవేసు కోవటమో లేక దాన్ని మరెవరో దొంగి లించటమో జరిగిందన్న మాట! అవునా?" అని అడిగాడు.

కాళీవర్మ ఒక్క క్షణకాలం నివ్వెర పడి, "అవును, గురో! ఈ కోతివాణ్ణించి, ఆ మంత్రదండాన్ని మరెవరో తస్కరిం చారు. వాళ్ళెవరో తెలుసుకోవటం ఎలా? పైగా, మనం నగరంలో చొరపడాలన్నా ఒక పట్టాన సాధ్యమయేలా లేదు.



పోయింది: గోడలనేమైనా పగలకొట్ట గలదేమో చూస్తాను,'' అంటూ వేగంగా పోయి, గదతో గోడను బలంగా కొట్టాడు. ఆ దెబ్బకు కోట రాళ్ళలో ఒకటి పగిలి, ఒకటి, రెండు ముక్కలు కిందపడినై. ఆ మరుక్షణం గోడలపైన వున్న సైనికులు, ఉగ్రదండుడి కేసి బాణాలు వదిలారు.

భల్లూక మాంత్రికుడు, ఉగ్రదండుణ్ణి యివతలికి రమ్మని హెచ్చరించి, కాళీ వర్మతో, ''వర్మా, మర్కటుణ్ణించి, నా మంత్రదండాన్ని, మరెవరైనా మాంత్రికుడు దొంగిలించాడేమో అన్న అనుమానం కలుగుతున్నది,'' అన్నాడు.

భల్లూక మాంత్రికుడు యిలా మాట్లాడు తున్న సమయంలోనే, రాజభవనం ముందు ఎలుగుబంటు పట్టినప్పుడు, మర్కటుడి చేతినుంచి జారిపడిన మంత్ర దండాన్ని తీసుకుని, తమ జోలెలో పెట్టు కున్న బైరాగియువకులు; నగరం వెలపల చెరువుగట్టు మీద వున్న మర్రిచెట్టు కింద మంత్రం జపిస్తున్న తమ గురువును సమీపిస్తున్నారు.

ఆ బైరాగి యువకుల్లో పెద్దవాడు చిన్న వాడి నుంచి మంత్రదండాన్ని తన చేతికి తీసుకుని, ''ఒరే, తమ్ముడూ, గురువుగారి కిచ్చేముందు ఈ మంత్రదండం మహిమేపాటిదో చూద్దామా?'' అన్నాడు.

ఈ రాజు కోట తలుపుల్ని ఇనుముతో చేయించాడు. దుర్ముఖరాజు కోటతలు పులు కొయ్యవి కావటం వల్ల, మనం వాటికి నిప్పుపెట్టి కాల్చి. కోటలో ప్రవే శించగలిగాం,'' అన్నాడు.

భల్లూక మాంత్రికుడు ఒరలోంచి కత్తి దూసి, ''ఈ రాత్రికి మనం కోటవెలపలే డేరాలు నిర్మించి, వాటిల్లో వుండబో తున్నాం. కోట తలుపులు ఎలా బద్దలు చేయాలన్న సంగతి, రేపు తీరిగ్గా ఆలో చించవలసిందే.'' అన్నాడు.

ఆ మాటలు విని రాక్షసుడు ఉగ్ర దండుడు కోపంగా పళ్ళుకొరికి, ''నా రాతి గదే కోట ద్వారాలను బద్దలుచేయలేక

చిన్న బైరాగి సరే అన్నట్టు తల వూపాడు. పెద్దవాడు మంత్రదండాన్ని పైకెత్తి పట్టుకుని, ''అహాం, ఇహ్రీం, ఉహ్రూం! నిధి ద్వారాలు తెరు!'' అంటూ బలంగా నేల కేసి కొట్టాడు.

అప్పుడైన పెద్ద ధ్వనికి గురు బైరాగి కళ్ళు తెరవకుండానే, ''ఒరే, భైరవ బైరాగి ఎదటే మంత్రాన్ని తప్పుగా ఉచ్చరిస్తున్న పాపి ఎవడు? ఇదే, వాణ్ణి భస్మం చెయ్యబోతున్నాను!'' అంటూ ఇత్తడీ, వెండీపువ్వులు తాపడం చేసిన పొట్టి దండాన్నొకదాన్ని పైకెత్తాడు.

తమ గురువు అన్నమాటలకు భయ కంపితులైపోయిన బైరాగి శిష్యులిద్దరూ, అంతలోనే మంత్రదండం దెబ్బ తగిలిన చోట భూమిలో చిన్న పగులు ఏర్పడి, అందులోనుంచి చివ్వుమంటూ నీరు పైకి ఎగరటం చూసి, సంభ్రమాశ్చర్యాలు చెందారు. గురుబైరాగి కోపంగా పళ్ళు కొరుకుతూ, కళ్ళు తెరవబోయేంతలో, అతడి మీద నీరు జడివానలా పడింది.

భైరవభైరాగి, ''గురు ప్రభో!'' అంటూ ఎగిరిలేచి నిలబడి, "ఉరుములూ, మెరుపులూ లేని యీ వాన ఏమిటి?'' అంటూ దూరంగా కనబడిన శిష్యులకేసి చూసి,'' ఒరే, భూమిలోంచి ఆకాశంకేసి నీటిధార ఎగురుతున్నది, ఏమిటా వింత? ''అన్నాడు.

ఆ మాటతో బైరాగి శిష్యు లిద్దరూ కొంచెం ధైర్యం తెచ్చుకుని, ''భైరవ





గురో! మా మంత్ర శక్తితో, యీ నీటి బుగ్గను భూమి నుంచి పైకి తెప్పించాం. ఈనాటితో మా విద్య పూర్తయినట్టేగదా?'' అన్నారు.

జరిగిందేమిటో అర్థంకాక, ఆశ్చర్య పోతూ తన శిష్యుల్ని సమీపిస్తున్న భైరవ బైరాగి, తన పెద్ద శిష్యుడి చేతిలో వున్న మంత్రదండం కంటబడగానే, మరింత ఆశ్చర్యపోయి, ''ఒరే, ఏమిటది? మంత్రదండంలాగున్నదే!'' అన్నాడు.

''గురో, ఇది మంత్రదండంలాగా వుండటం కాదు, మంత్రదండమే! మూడు ముక్కల మంత్రం ఉచ్చరించి, నిధి ద్వారాలు తెరవమంటే, పాతాళగంగను పైకి లేపింది,'' అన్నాడు పెద్ద శిష్యుడు ఉత్సాహంగా.

భైరవబైరాగి శిష్యుడి చేతిలో నుంచి మంత్రదండం తీసుకుని, దాన్ని అటూ యిటూ తిప్పి చూసి, ''ఇది ఏ మాంత్రికుడి చేతిలోనో చాలా కాలంగా నలిగి, బాగా నునుపు తేలింది. ఇది మీ చేతికి ఎలా చిక్కింది? దొంగిలించారా? ఆ మాంత్రికుడేమయ్యాడు?'' అని అడిగాడు.

పెద్ద శిష్యుడు, చిన్నవాడికి మాట్లాడ వద్దని సైగ చేసి, గురువు చేతిలో నుంచి మంత్రదండాన్ని చప్పున లాక్కుని, ''గురో, ముందు జలధారను ఆపాలి. లేకపోతే కొద్ది గంటల్లో నగరమే నీట మునిగిపోగలదు,'' అని, మంత్రదండాన్ని పైకెత్తి, ''నిధి ద్వారాలు బంధించు!'' అంటూ నీటిధార వస్తున్న ప్రదేశాన బలంగా కొట్టాడు.

ఈసారి మంత్రదండం దెబ్బకు భూమి ఫెళఫెళమంటూ పగిలిపోయి, అక్కడ ఒక మనిషి పట్టేంత కంత ఏర్పడింది. ఇది చూస్తూనే భైరవ బైరాగి ఎగిరి గంతు వేసి, ''ఒరే, శిష్యోప శిష్యుల్లారా! ఎలా సంపాదిస్తేనేం, అద్భుత శక్తులు గల మంత్రదండాన్ని నాకు కానుకగా తెచ్చారు. మీ గురు భక్తికి మెచ్చాను. జలధార

ఆగిపోయి. నిధి ద్వారాలు తెరుచుకున్న ట్టున్నది. లోపలికి దిగి అక్కడున్న నిధులేమిటో తెలుసుకోండి,'' అన్నాడు.



చిన్నశిష్యుడు మంత్రదండం కేసి అనుమానపడుతున్నవాడిలా చూస్తూ, ''భైరవ గురో! ఈ మంత్రదండం శక్తుల్ని నమ్మి, మనం ఏవో చిక్కుల్లో పడబోతున్నాం అని నాకు భయంగా వున్నది. నిధి ద్వారాలు తెరవమంటే, భూమిలోంచి నీటిబుగ్గను ఆకాశంలోకి లేపింది. ఆ సంగతి గమనించారా? దీనివల్ల నిధులు దొరుకుతవన్న నమ్మకం నాకు లేదు,'' అన్నాడు.

శిష్యుడు యిలా అనేసరికి భైరవ బైరాగికి కూడా మంత్రదండాన్ని గురించి శంక కలిగింది. అది కోరినది కాక మరొకటి యివ్వటం మొదలు పెడితే, అది ఎన్ని ప్రమాదాలకైనా దారి తీస్తుంది!

బైరాగి యిలా ఆలోచిస్తూ, పెద్ద శిష్యుడి నుంచి మంత్రదండాన్ని తీసుకుని, దానికేసి పరీక్షగా చూస్తున్నంతలో, వాడు ఒకసారి పెద్దగా నవ్వి, "గురో, దీని శక్తులెలాంటివో మనకెందుగ్గాని, ఒక పని చేద్దామంటారా? దీన్ని మంత్రశక్తులు గల ఒకానొక మర్కటుడి నుంచి మేం సంపాయించాం. వాడిప్పుడు జితకేత రాజుగారి ప్రధానమంత్రి! పోయిన యీ మంత్రదండాన్ని తిరిగి తెచ్చిన వాళ్ళకు అర్ధరాజ్యంతోపాటు, తన కుమార్తెను కూడా యిచ్చి పెళ్ళి చేస్తానని, ఆ రాజు ప్రకటించాడు,'' అన్నాడు.

అర్ధరాజ్యం, రాజకుమార్తె అని వింటూనే భైరవబైరాగి ''గురుప్రభో!'' అంటూ పెద్దగా అరిచి, ''ఒరే, శిష్యుల్లారా, యింత ముఖ్య విషయాన్ని నాకు చెప్పకుండా, యింతసేపు దాచారన్నమాట. నేను అర్ధరాజ్యం, మీలో ఒకరు రాజకుమార్తెనూ పెళ్ళాడటం బాగానే వుంటుంది. కాని, రాజుల మాటలు అంతగా నమ్మదగినవి కాదు. ఆ జితకేతుడు మన నుంచి మంత్రదండాన్ని




తీసుకుని. తలలు నరికించేస్తే, మనం చేయగలదేమున్నది!'' అంటూ తల వంచుకుపోయి, మర్రిచెట్టు బోదెకు చేరగిలపడ్డాడు.

గురువు యిలా అన్న తరవాత బైరాగి శిష్యులకూడా రాజు మాటలు నమ్మదగినవి కాదేమో అన్న అనుమానం కలిగింది. చిన్నవాడు భూమిలో ఏర్పడిన కంతను సమీపించి, పెద్దవాడిచ్చిన చేయి ఆసరాతో లోపలికి దిగి, మరుక్షణంలో, ''భైరవ గురో! ఇక్కడేవో మెట్లూ, భూసొరంగం వున్నది. మంత్రదండం మనకు నిధి ద్వారాలే తెరిచి వుంటుంది,'' అంటూ కేక పెట్టాడు.

భైరవబైరాగి ఉత్సాహంగా తన శిష్యుల దగ్గిరకు వచ్చి, "ఒరే, శిష్యోప శిష్యుల్లారా! అదృష్టంకొద్దీ మనకు నిధి దొరికితే, మనం ప్రస్తుతానికి దానితో తృప్తి పడదాం. ఈ మంత్రదండాన్ని రాజుకు యివ్వాలో లేదో తరవాత నిదానంగా ఆలోచించవచ్చు.'' అంటూ తానూ సొరంగ మార్గంలోకి దిగుతూ, పైనున్న శిష్యుణ్ణి కూడా వెంటరమ్మన్నాడు.

గురు, శిష్యులు అక్కడ వున్న మెట్ల మీదుగా మరికొంత దిగువకు పోయేసరికి, ఆ ప్రదేశం జలమయంగా వున్నది. వాళ్లు మోకాటి లోతు నీటిలో కొంత దూరం నడిచేసరికి, సొరంగ మార్గంలో దూరంగా చిన్న వెలుగు కనిపించింది.

భైరవబైరాగి మహదానంద పడిపోతూ, తన శిష్యులతో, ''ఒరే, ఆ వెలుగు మరేదో అయివుండదు. నిధినిక్షేపంలోని మణిమాణిక్యాలు అలా ధగధగ లాడుతున్నవి. ఇంతకూ, అక్కడ ఒకవేళ నిధిని కాపాడుతూ, ఏ యక్షుడో వుండటం జరిగితే, మనం ఏం చెయ్యాలి?'' అన్నాడు.

''ఆ సంగతి గురువులైన తమరే మాకు తెలియచెప్పాలి,'' అన్నాడు పెద్దశిష్యుడు.

చిన్న శిష్యుడు హేళనగా నవ్వి, ''ఒరే, అన్నశిష్యా! నీకు గురువుగారు చెప్పిన

మంత్రాలైతే నోట పట్టినైగాని, లోకజ్ఞానం ఆవగింజంత అయినా అబ్బలేదు. మనకు నిధిని చూపించిన యీ మంత్రదండం ఎటువంటి అద్భుత శక్తులు గలదో, ఆలోచించలేదా? ఆ నిధుల కాపలా యక్షుడికి, మంత్రదండాన్ని తాకించామంటే వాడు టపాకాయిలా పేలిపోతాడు,'' అన్నాడు.

''బాగా చెప్పావు, ఉపశిష్యా! నా మంత్రబోధ, నీకు బాగా ఒంటపట్టింది. ఇక ఆట్టే మాట్లాడక నిశ్శబ్దంగా ముందుకు నడవండి,'' అన్నాడు భైరప బైరాగి, మంత్రదండాన్ని దూరంగా కనబడుతున్న వెలుగు కేసి గురిచేస్తూ.

అంతలో వాళ్ళకు పైన భూమి కంపించిన ధ్వనితోపాటు ఏనుగు ఘీంక రించటం వినబడింది. ముగ్గురూ ఒకటి, రెండు క్షణాలపాటు భయంతో స్తంభించి పోయారు. ముందుగా బైరాగి తెప్పరిల్లి, ''ఒరే, మన మర్రిచెట్టు కిందికి అడవి ఏనుగులో లేక గజసైనికులో వచ్చి నట్టుంది. వాళ్ళు మన రహస్య సొరంగ మార్గం గుర్తించి, లోపలికి దిగితే మనం ఏం చెయాలి?'' అన్నాడు.

''ఏం చేయాలన్నది గురువులైన తమరే ఆలోచించి, మాకు చెప్పాలి,'' అన్నాడు పెద్ద శిష్యుడు.



చిన్నశిష్యుడు పకపక మంటూ నవ్వి, ''అడవి ఏనుగులకూ, గజసైనికులకూ చెరువు కట్టల మీది కంతలూ, గుంటలూ చూడటం తప్ప మరేం పని లేదనుకున్నారా? ఆ కనబడే నిధిలోని రత్న రాసుల గురించి తప్ప, మరిదేన్ని గురించీ ఆలోచించకండి,'' అన్నాడు.

వాడు మాట ముగించేలోపలే పైనుంచి ఒక మన్నుపెళ్ళ విరిగి దభీమంటూ వాళ్ల ముందు పడింది. గురుశిష్యులు భయ కంపితులైపోయి, చిన్నగా అరిచి, సొరంగ మార్గాన ముందుకు పరిగెత్తసాగారు.

ఆ సొరంగ మార్గం పైనవున్న చెరువు కట్టమీద, గుడారాలు నిర్మించేందుకు

మంచి చోటుకోసం వెతుకుతూ ఏనుగు మీద వచ్చిన తలారిభల్లూకుడూ, ఆటవికుడూ, తామెక్కివున్న ఏనుగు కాలొకటి హఠాత్తుగా భూమిలోదిగిపోయి, అది ఘీంకరిస్తూ ముందుకు పడిపోవటం చూస్తూనే, దానిమీది నుంచి కిందికి దూకేశారు. ఆ మరుక్షణం ఏనుగు తొండంతో భూమిని గట్టిగా తాటిస్తూ లేచి నిలబడింది.

తలారి భల్లూకుడు చుట్టూ ఓ మారు కలయచూసి, ఆటవికుడితో, "కాళీవర్మ దొరా, భల్లూక మాంత్రికుడు కూడా ఒక సారి యీ ప్రదేశం చూస్తే బావుండును. ఇక్కడ నీటికి కొదవలేదు: మనం పట్టవలసిన జితకేతురాజు కోట కూడా దగ్గిర్లోనే వుంది. ఎన్ని మంత్రాలు నేర్చినా ఆ మాయామర్కటుడు, తన కోతి స్వభావం కొద్దీ, యీ ఊడలమర్రి కేసి రావటం జరిగితే, వాణ్ణి తేలిగ్గా పట్టుకుని, భల్లూక మాంత్రికుడి మంత్రదండాన్ని గుంజుకోవచ్చు." అన్నాడు.

ఆటవికుడు, తలారి భల్లూకుడి మాట లేవీ వినటంలేదు. వాడు ఏనుగుకాలేమైనా విరిగిందేమో అని పరీక్షిస్తూ, దాన్ని అటూ యిటూ నడిపిస్తున్నాడు. ఏనుగు ఏ మాత్రం కుంటకుండా మామూలుగా నడవటం చూసి, వాడు తృప్తిపడి తలారి భల్లూకుడితో, "తలారి భల్లూకయ్యా! మన వాహనం కాళ్ళేమీ చెక్కుచెదరలేదు: అదృష్టవంతులం!" అన్నాడు.

ఆ వెంటనే మర్రికొమ్మల్లోంచి ఒక బోయవాడు కిందికి దూకుతూ, "దొంగ బైరాగుల్ని మింగిన భూసారంగం కంత కేసి, మీ ఏనుగు పోకపోవటం, మీ అదృష్టం. లేకపోతే అది మిమ్మల్ని, బైరాగుల్లాగే నిలువునా మింగేసేది." అన్నాడు.

తలారి భల్లూకుడు, "దిరిసెనవన భైరవా!" అంటూ గండ్రగొడ్డలి పైకెత్తి, "ఎవడివిరా నువ్వు! మాయామర్కటుడి శిష్యుడివా?" అంటూ బోయవాడి కేసి బయలుదేరాడు. —(ఇంకా వుంది.)





# రుజువుకాని నేరం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్లి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, నువు ఏ నీతి నియమానికి కట్టుబడి ఇలా శ్రమిస్తున్నావో నాకైతే తెలియదుగాని, ఈ లోకంలో నీతి జయిస్తుందనీ, అవినీతికి శిక్ష ఉంటుందనీ చెప్పటానికి లేదు. ఇందుకు నిదర్శనంగా నీకు గిరిధరుడు అనే వాడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

చాలాకాలం క్రితం హరిప్రసాద్ అనే ఆయన మూడు గ్రామాలకు జమీందారు. జమీందారీ వ్యవహారాలన్నిటినీ గిరిధరుడు అనే సమర్థుడు చూస్తూ ఉండేవాడు. అతను మంచివాడూ, జమీందారుకు విశ్వాసపాత్రుడూనూ. అతని ప్రతి సల

## బేతాళ కథలు



హానూ జమీందారు మారు మాటాడకుండా స్వీకరించేవాడు. గ్రామాలలో ఎవరికి ఏది కావలసినా, గిరిధరుడికి ఒక నమస్కారం పెట్టి, పని జరిపించుకునేవారు. క్రమంగా ఊళ్లు పెరిగాయి; వాటితోబాటు నమస్కారాలు పెట్టేవాళ్ల సంఖ్య కూడా పెరిగింది. ఒకేరకం సహాయం ఇద్దరు, ముగ్గురికి అవసరమైనప్పుడు వాళ్ళలో పోటీలు ఏర్పడసాగాయి. నమస్కారాలు పెట్టేవాళ్ల మీద పోటీగా కొందరు పళ్ల బుట్టలు పట్టుకు రాసాగారు. గిరిధరుడు సహజంగా నమస్కారాల వాళ్లను పక్కకు నెట్టి, పళ్ళబుట్టల వాళ్ళకు ఎక్కువ శ్రద్ధ చూపక తప్పలేదు.

పనులు చేయించుకునే వాళ్ళలో పోటీ ఇంకా పెరిగిపోయింది. పళ్లబుట్టల మీద రూపాయల సంచులు ఎక్కి వచ్చాయి. ఈ విధంగా అడగకుండా డబ్బు తన ఇంటికి నడిచి వస్తుంటే దాన్ని తోసిపుచ్చటంలో గిరిధరుడికి అర్థం కనిపించలేదు.

గుడిపూజారి ఉద్యోగమేగానీ, బడిపంతులు ఉద్యోగమేగానీ డబ్బు ముట్టచెప్పిన వాడికే దక్కుతున్నది. రానురాను గిరిధరుడి భార్య మెడనిండా మోయలేనంత బంగారమూ, ఇంటి నిండా అంతులేని వస్తుసామగ్రి ఏర్పడ్డాయి.

దీని ఫలితంగా హరిప్రసాదు జమీందారీలో లంచం పెట్టగలవాడికే తప్ప, నిజమైన అర్హతలుగల బీదవారికి బతుకుతెరువు లభించకుండా పోయిందని ప్రజలు చెప్పుకోసాగారు.

శేషగిరి అనే పేదవాడు ఈ సంగతి స్వానుభవం ద్వారా తెలుసుకున్నాడు. అతను కటిక పేదవాడు; వారాలుచేసి చదువుకుని, ఎంతో తెలివితేటలు గలిగిన వాడు. అతను గిరిధరుడికి చాలా నమస్కారాలు పెట్టాడు, కాని ఒక పళ్ళబుట్ట అయినా ఇయ్యలేకపోయాడు. అతనికి ఏ ఉద్యోగమూ దొరకలేదు. తన నమస్కార బాణాలు గిరిధరుడికి ఎక్కడా

తగలలేదని తెలిసి, శేషగిరికి ఒళ్ళు మండుకొచ్చింది.

అతను జమీందారు వద్దకు వెళ్ళి, ''మీ జమీందారీ వ్యవహారం ఏమీ బాగా లేదు. లంచం పెట్టితే చాలు, ఎలాటి పనికిమాలిన వాడికైనా పని దొరుకుతున్నది. చదువూ, తెలివీ ఉన్న పేదలు నీరు కారిపోతున్నారు,'' అంటూ గిరిధరుడి మీద ఫిర్యాదు చేశాడు.

జమీందారు నిర్ఘాంతపోయాడు. అతనికి గిరిధరుడి మీద అంతులేని నమ్మకం! గిరిధరుడు ఎందరో పేదవారిని చూసి జాలిపడి, తనతోచెప్పి బంజరు భూములు ఇప్పించాడు! ఇన్ని ఏళ్ళ మీద గిరిధరుణ్ణి గురించి ఒక్క ఫిర్యాదు కూడా రాలేదు.

శేషగిరి మాట నమ్మలేక జమీందారు, ''నీ మాట నిజమైతే గిరిధరుడి ఉద్యోగం నీకిస్తాను,'' అని చెప్పి, అతన్ని పంపేశాడు.

తరవాత జమీందారు యాయవారం బ్రాహ్మణ్ణి ఒకణ్ణి పట్టుకుని, ''ఫలానా గ్రామంలో కొత్తగా గుడి కట్టారు. ఈ నూరు రూపాయల సంచీ తీసుకుని ఆ వూళ్లో ఉండే గిరిధరుడికి ఇచ్చి, గుడి పూజారి పని ఇప్పించమని అడుగు!'' అని చెప్పి పంపేసి పూజలు చేయించటంలో చాలాకాలంగా అనుభవం ఉన్న మరొక బ్రాహ్మణ్ణి పిలిపించి, ''నువు ఫలానా గ్రామంలో ఉన్న గిరిధరుడు అనే ఆయనకు నమస్కారం చేసి, కొత్త





దేవాలయానికి పూజారి పని ఇప్పించమని అడుగు." అని అతన్ని కూడా పంపేశాడు.

ఇద్దరూ ఇంచుమించు ఒకేసారి గిరిధరుడి దగ్గిరికి వెళ్ళారు. యాయవారపు బ్రాహ్మడు రూపాయల సంచీ పట్టుకు కూర్చున్నాడు. అయినా రెండోవాడు తన చిన్ననాటి మిత్రుడు కావటంవల్ల, గిరిధరుడు అతనితో చాలాసేపు సరదాగా కబుర్లు చెప్పి, అతనితో వచ్చినపని తెలుసుకుని, "ఈ గుడి మన జమీందారుగారు కట్టించినదే! నీవంటి అనుభవంగలవాణ్ణి పూజారిగా నియమించటానికి జమీందారుగారు ఎందుకు అభ్యంతరం చెబుతారు?" అన్నాడు.

యాయవారపు బ్రాహ్మడు కూడా అదే పని కోసం వచ్చాడని తెలిసి, గిరిధరుడు, "ఏమీ రాని నీకు పూజారి పని ఏమిటి? వెళ్లవోయ్!" అన్నాడు.

గిరిధరుడు తన చిన్ననాటి స్నేహితుణ్ణి గుడిపూజారిగా నియమించాలని జమీందారుకు సలహా ఇచ్చిన మీదట, జమీందారు శేషగిరికి కబురుపెట్టి, "నేను గిరిధరుడికి పరీక్ష పెట్టిచూశాను. అతను లంచగొండి అని రుజువుకాలేదు," అని చెప్పాడు.

శేషగిరి కొంచెం చిరాకుపడి, "అతను లంచగొండి అనటానికి వేరే పరీక్షకావాలాండీ? అతని భార్య మెడలో ఉన్న కట్టెడు బంగారు నగలు చూడండి! సామానుల కొట్టులాగా ఉండే అతని ఇల్లు చూడండి. మీరిచ్చే జీతం మీద అతను అంత బంగారమూ, అన్నిసామాన్లూ కొనలేడని మీకే తెలుస్తుంది," అన్నాడు జమీందారుతో.

జమీందారు గ్రామాల తణిఖీ నెపం మీద త్వరలోనే, చెప్పకుండా పెట్టకుండా, గిరిధరుడి ఇంటికి వెళ్ళాలని నిశ్చయించుకున్నాడు.

కాని అప్పటికి రెండు రోజులు ముందుగా గిరిధరుడి బావమరిది వచ్చి, "మా ఊళ్ళో మంచిపాలం అమ్మకానికి

వచ్చింది. కొందామంటే నా వద్ద డబ్బు లేదు. నువ్వయినా కొనుక్కో! చాలా మంచి బేరం!'' అన్నాడు.

గిరిధరుడు సంకోచించకుండా తన భార్యనగలన్నీ ఒలిచి తన బావమరిదికి ఇచ్చి, ''ఈ నగలు తాకట్టుపెట్టి పొలం కొనుక్కో. తరవాత పొలం మీద వచ్చే ఆదాయంతోనే మెల్లిగా తాకట్లు విడి పించుకోవచ్చు.'' అన్నాడు.

అదేసమయంలో గిరిధరుడి పొరుగు ఇంట పెళ్ళి జరిగింది. వాళ్ళ అవసరం కోసం గిరిధరుడు తన ఇంటి సామాను దాదాపు అంతా అరువు ఇచ్చాడు.

అలాటి పరిస్థితిలో అకస్మాత్తుగా గిరి ధరుడి ఇంటికి జమీందారు వచ్చాడు. గిరిధరుడు ఆయనను చూసి కంగారు పడుతూ, ''అయ్యో, కూర్చోవటానికి సరి అయిన కుర్చీకూడా లేదు,'' అని, ఒక జంపఖానా పరిచి దాని మీద కూర్చునే టందుకు ఒక ముక్కాలి పీటవేశాడు.

గిరిధరుడి భార్య, ''ఒక వెండి గ్లాసయినా లేదు,'' అనుకుంటూ బాగా తోమిన కంచులోటాలో పాలుపోసి, పళ్ళెంలో కొన్ని పళ్ళుతెచ్చి జమీందా రుకు ఇచ్చింది. జమీందారు ఆమెను పర కాయించి చూశాడు. ఆమె మెడలో పసుపుతాడు తప్పలేదు! చేతులు బోసిగా ఉన్నాయి! ఇల్లంతా బావురుమంటున్నది.

''నా గురించి ఏమీ హైరాన పడవద్దు. గ్రామంలో పని ఉండి వచ్చి, పలకరించి





పోదామని తొంగి చూశాను!'' అంటూ జమీందారు లేచాడు.

గిరిధరుడు నొచ్చుకుంటూ, ''పని ఏదన్నా ఉంటే నాకు కబురు చెయ్యక పోయారా? మీరు రావలసినపని ఏమిటి? నేనే వద్దామనుకుంటున్నాను. ఈ మధ్య కొంత పన్ను వసూలయింది,'' అని డబ్బు సంచీ తెచ్చి జమీందారు ముందు పెట్టాడు.

గిరిధరుడు పరమ దరిద్రపు స్థితిలో ఉన్నట్టు నమ్మకం కలగటంచేత జమీందారు, ''ప్రస్తుతం ఈ డబ్బు నీ అవసరానికి ఉంచుకో. లెక్కలు తరవాత తీరికగా చూసుకోవచ్చు,'' అని, డబ్బు సంచీ తీసుకోకుండా తిరిగి వెళ్ళిపోయాడు.

తరవాత ఆయన శేషగిరిని పిలిపించి, ''నువు చెప్పినది ఒకటీ రుజువుకాలేదు. గిరిధరుడి ఇల్లు అయ్యవారి నట్టిల్లులా ఉన్నది. అతని భార్య మెడలో పుస్తెలకు పసుపుతాడు తప్పలేదు! అతని మీద ఇలాటి అభాండాలు నాతో ఎందుకు చెప్పావో తెలీదు! నువు ఇక వెళ్ళవచ్చు!" అని పంపేశాడు.

జమీందారు అబద్ధం ఆడి ఉండడు. కాని గిరిధరుడికి అలాటి పరిస్థితి ఎందుకు ఏర్పడినదీ శేషగిరి ఊహకు అందలేదు. ''అతన్ని దేవుడేకాపాడుతూ ఉండాలి, లేకపోతే అతనిలాటి లంచగొండిని ఎందుకు నిరూపించ లేకపోతాను!'' అనుకుని, తన దురదృష్టాన్ని కూడా తిట్టుకున్నాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, దైవికంగా గిరిధరుడు తన నేరం బయట పడకుండా తప్పించుకున్నంత మాత్రాన అతను శిక్షార్హుడు కాకుండా పోతాడా? అలాంటివాణ్ణి గుడ్డిగా నమ్మిన జమీందారు అవివేకి కాదా? ఈ సందేహాలకు సమాధానాలు తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''ఉద్యోగాలు ఇప్పించటంలో గిరిధరుడు అవలంబించిన పద్ధతి నీతితో కూడినది కాదనటానికి

సందేహంలేదు. అయితే అవినీతి అన్నది రెండు విధాలుగా ఉంటుంది. కొందరు వ్యక్తులు స్వార్థంకొద్దీ సంఘనీతిని ధిక్కరించి అవినీతిగా ప్రవర్తిస్తారు. అలాటి వారి అవినీతికి శిక్ష సంఘం నుంచే వస్తుంది. కాని గిరిధరుడి విషయంలో అవినీతికి కారణం సంఘంలోనే ఉన్నది. జమీందార్ల ఉద్యోగులు కానుకలు పుచ్చుకోవటం తప్పు కాదు. అయినా కానుకలు పుచ్చుకున్నందుకు ప్రత్యుపకారం చెయ్యటం తప్పనిసరి అవుతుంది. గిరిధరుడు ఎవరికి ఉద్యోగం ఇచ్చినా లంచం ఇయ్యాలన్న నియమం పెట్టలేదు. అతను స్వార్థపరుడు కాదనీ, అతనికి కానుకలు ఇచ్చినవారు బుద్ధిపూర్వకంగా ఇచ్చారని స్పష్టంగా తెలుస్తుంది. స్వతహాగా అతను చాలా మంచివాడు, ఇతరులకు సహాయపడేవాడు; అంతేగాని ఇతరులను పీడించేవాడు కాడు. తాను కొనుక్కోగల పొలాలు తన బావమరిది కొనుక్కోగలందులకు తన భార్య ఒంటి మీది నగలన్నీ ఊడ్చి ఇచ్చాడు. ఎవరో పొరుగువారింటి పెళ్ళికి తన ఇంటి సామానంతా అరువిచ్చాడు. స్వతహాగా అతను స్వార్థపరుడూ, శిక్షార్హుడూ కాడు. పోతే జమీందారు కూడా అవివేకి ఎంత మాత్రమూ కాడు. తాను ఎంతో విశ్వాసంతో చూసుకుంటున్న గిరిధరుడి మీద ఫిర్యాదు వస్తే దాన్ని తోసిపారెయ్యక, రెండు పరీక్షలకు అతన్ని గురి చేశాడు. ఒకవేళ గిరిధరుడి సంపద బయటపడినా జమీందారు అతన్ని శిక్షించటానికి అవసరమైన విషయం శేషగిరి రుజువు చేయలేదు. అదేమిటంటే, గిరిధరుడు ఎవరికిగాని లంచం ఇస్తేనే ఉద్యోగం ఇప్పిస్తానన్నమాట! అలా అడిగే అలవాటుంటే గిరిధరుడు శేషగిరినే లంచం అడిగి ఉండేవాడు! దీన్నిబట్టి జమీందారు తనలో ఉంచిన విశ్వాసానికి గిరిధరుడు అర్హుడనే చెప్పాలి,'' అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)



# నిజమైన కలలు

సుబ్బిశెట్టి పరమలోభి. ప్రాణం పోతున్నదన్నా పైసా దానం చేసేవాడుకాడు. అలాటి వాడికి ఒకసారి కలలో, "వంద రూపాయలు దానం చెయ్యి; వెయ్యి రూపాయలు లభిస్తాయి!" అని వినపడింది.

శెట్టి ఆ కలను నమ్మి, వంద రూపాయలతో పేదలకు సంతర్పణ చేశాడు. అతని దూరపు బంధువు ఎవరో చచ్చిపోతూ, శెట్టికి వెయ్యి రూపాయలు ముట్టజెప్పాడు. కల నిజమయింది!

మరికొన్నాళ్ళకు శెట్టికి కలలో, "వెయ్యి రూపాయలు దానం చెయ్యి, పదివేలు లభిస్తాయి!" అని వినపడింది. శెట్టి ఈసారి వెయ్యి రూపాయలతో ఇంకా పెద్ద ఎత్తున దానధర్మాలు చేశాడు. ఆ రోజే శెట్టి దగ్గిర బంధువు చచ్చిపోయాడు. అతని పదివేల రూపాయల ఆస్తి శెట్టికి సంక్రమించింది. మళ్ళీ కల నిజమయింది.

మరి కొంతకాలానికి శెట్టి భార్యకు కలలో, "పదివేలు దానం చెయ్యి, లక్ష రూపాయలు దొరుకుతాయి!" అని వినపడింది.

ఆమె శెట్టికి ఈ మాట చెప్పింది. కలలో మంచి గురి కుదిరిన శెట్టి పదివేలు పెట్టి ఊరందరికీ విందులు చేశాడు.

ఆ మర్నాడే శెట్టి ఆకస్మికంగా చచ్చి, తన ఆస్తి లక్ష రూపాయలూ తన భార్య పరం చేసి పోయాడు.

ఈసారి కూడా కల నిజమయింది!

—ఇంద్రగంటి నరసింహమూర్తి





# గండడి గర్వభంగం

పూర్వం తుని రాజావారి దివాణంలో గండడు అనే పేరుమోసిన వస్తాదు ఉండేవాడు. వాడు అయిదారుగురి తిండి తినేసి, కండలు తిరిగి, చూడటానికే భయం పుట్టేలా ఉండేవాడు. వాడితో మల్లయుద్ధం చేసి గెలిచినవాళ్ళు లేరు. ఓడిపోయిన వాళ్ళు నెలరోజులు మంచాన పడి తీసుకునేవాళ్ళు! అందుచేత అన్నప్పుడల్లా వాణ్ణి ఎవరూ సవాలు చేసేవారుకారు.

అందువల్ల గండడికి గర్వం బలిసిపోయింది. వాడికి ఒకరి భయమూ, అదుపూ, ఆజ్ఞా లేకుండాపోయింది. దుకాణాలలోకి వెళ్ళి తనకు కావలసినవి స్వేచ్ఛగా తీసుకునేవాడు; అభ్యంతరం చెప్పిన వాళ్ళను చితకబాదేవాడు.

ఒక రోజు ఒక ముసలిది బత్తాయిపళ్ళు గంపలో పెట్టుకుని అమ్ముకుంటూ వీధిలో కూర్చుని ఉంటే, గండడు దాని తట్టలో చెయ్యిపెట్టి తనకు కావలసిన పళ్ళు ఏరుకున్నాడు. ముసలిది డబ్బులడిగింది. గండడు దాని తట్టను వీధిలోకి తన్నాడు. బత్తాయిపళ్ళన్నీ వీధిలో దొర్లాయి.

"నీ ప్రతాపం ఈ ముసలిదాని మీద చూపిస్తావట్రా? చేతనైతే మా ఊరి బండడి మీద చూపించు!" అన్నది ముసలిది, దొర్లిపోయిన పళ్లు ఏరుకుంటూ.

"ఏ ఊరు మీది?" అని గండడు రోషంగా అడిగాడు,

"అరట్లకోట." అన్నది ముసలిది.

"నా ప్రతాపం చూపిస్తానే, ముసలినక్కా! రేపీపాటికి ఆ బండడి శవాన్ని తెచ్చి, ఈ వీధిలోనే నీ ముందు పడేస్తాను," అంటూ గండడు వెళ్లిపోయాడు.

కాని ఆ బండడిని పట్టి హతమార్చే దాకా గండడి మనస్సు దహించుకుపోతున్నది. వాడు వెంటనే గుర్రబ్బండి

అన్నంనీడి బాపూజీ



చేసుకుని, అరట్లకోటకు ప్రయాణమయాడు. బండి అరట్లకోట చేరేసరికి సాయంకాలమయింది. గండడు బండిలో నుంచి దిగగానే వాణ్ణి చూసిన గ్రామస్థులు దయ్యాన్ని చూసినట్టు దూరంగా తప్పుకుపోయారు. గండడు గర్వంగా మీసం మెలివేశాడు.

తనను చూసి దూరంగా పోతున్న వాళ్ళను గండడు పిలిస్తే, వాళ్ళు మరింత వేగంగా వెళ్ళిపోయారు. తరవాత వాడు ఒక ముసలివాడు కనిపిస్తే, "ఏయ్, ముసలాడా! ఈ ఊళ్ళో బండడు అనే వాడు ఉన్నాడట. వాడు ఎక్కడుంటాడో నీకు తెలుసా?" అని అడిగాడు.

"తెలయకేం, నాయనా? ఊరవతల తోపులో గొర్రెలను మేపుతూ ఉంటాడు," అన్నాడు ముసలాడు.

"సరే, నే నెవరో నీకు తెలుసా?" అని గండడు గర్వంగా అడిగాడు.

"నువు ఏవరైతే నాకేం, నాయనా? నువూ నాలాటి మనిషివే. కాకపోతే నువు వయసులో, కండలు తిరిగి ఉన్నావు. నేను వయసు ఉడిగి, బక్కచిక్కి ఉన్నాను," అంటూ ముసలాడు కర్ర ఆడించుకుంటూ వెళ్ళిపోయాడు.

గండడు బండి విప్పేసి, ఊరవతల చింతలతోపు కేసి బయలుదేరాడు. గండుడు అక్కడికి చేరేసరికి, ఒక మనిషి గడకర్రతో చింతకొమ్మలు కోసి, గొర్రెలకు మేపుతూ కనిపించాడు.

గండడు ఆ మనిషిని ఎగాదిగా చూసి, "నువ్వేనా బండడివి?" అని అడిగాడు.

తాను లోగడ విన్నదాన్నిబట్టి బండడు గండణ్ణి గుర్తించి, వెంటనే తనను తాను బయటపెట్టుకోవటం ఇష్టం లేక, "కాదు, మా అన్న! మీరు దివాణంలో మల్లుడుగారు కాదూ? మా అన్నతో ఏం పని?" అన్నాడు.

"వాడికి చాలా పొగరుగా ఉందట! ఒక పట్టుపట్టి చూద్దామని!" అంటూ గండడు, బండడు గడతో లాగుతున్న

చింతకొమ్మను పట్టుకుని ఒక్కలాగు లాగాడు. అది పెళపెళలాడుతూ పలవతో సహా విరిగి పడిపోయింది.

బండడు ఆశ్చరంగా చూస్తూ, ''ఏడి చాడు! వాడితో మీకేమిటి? నామాట నమ్మండి, వాడు మీ కాలిగోరికి పోలడు,'' అన్నాడు.

"ముందు వాడు ఎక్కడున్నాడో చెప్పు!" అని గండడు హుంకరించాడు.

''పొరుగూరు వెళ్ళాడు. రాత్రికి వస్తాడు. అంతగా మీరు చూడాలనుకుంటే చూపుతానులెండి, అంతదాకా మీరు నాతోనే ఉందురుగాని, ఈ గొర్రెలను యిప్పుడే దొడ్డికి తోలివస్తాను,'' అన్నాడు బండడు.

బండడు గండణ్ణి తన ఇంటికి తీసుకు వచ్చి, ''అమ్మా, మరో అతిథికి కూడా వంట చెయ్యి,'' అని కేక వేశాడు.

''ఛ! నీ పెట్టకూడు నా కేమూల?'' అన్నాడు గండడు.

''అయ్యా, గొర్రెను వండించటానికి అవి మనవికావు, ఊళ్ళోవాళ్ళవి. ఏదోలా ఈ పూటకు ఈ బక్కవాడి ఆతిథ్యం స్వీకరించండి,'' అన్నాడు బండడు.

మరో గంటకు ఇద్దరూ భోజనానికి కూర్చున్నారు. బండడి తల్లి రెండు పెద్ద ఆకుల్లో ఇద్దరికీ అన్నం వడ్డించింది.

గండడు మొదటిముద్ద నోట్లో పెట్టుకుని, ''ఛీ, ఛీ! ఇది అన్నమా? రాళ్లా?'' అన్నాడు.



''పళ్ళులేని ముసలివాళ్ళకైతే అన్నం మెత్తగా ఉండాలి. రాళ్ళు తిని హరాయించుకునే మనకెందుకు?'' అని బండడు తేలిగ్గా అనేసరికి, గండడికి కొంచెం సిగ్గయింది. కాని మెత్త మెత్తని మాంసం తినటానికి అలవాటుపడ్డ గండడికి, ఈ ఉడికీ ఉడకని అన్నం మింగుడు పడటంలేదు. మాటిమాటికీ అతను గొంతు తడిచేసుకుంటున్నాడు. తినటం మానేస్తే చిన్నతనం!

గండడి అవస్థను గమనిస్తున్న బండడు తనలోతాను నవ్వుకుని, "అమ్మా, నువ్వుల నూనె తీసుకురా!" అని కేకపెట్టాడు.

''బతికానురా, బాబూ!'' అనుకున్నాడు గండడు.

కాని బండడి తల్లి తెచ్చినది నువ్వుల నూనె కాదు, ముడినువ్వులు.

''చూస్తారేం? నూనె పోసుకోండి!'' అంటూ బండడు, తన ఎడమచేతిలోకి కొన్ని నువ్వులు తీసుకుని పిండుకుని, నూనె తెప్పించి, అన్నంలో పోసుకున్నాడు.

ఇలాటిది సాధ్యమని గండడు ఎరగడు, కాని వాడు చేసిన పని తాను మరింత తేలికగా చెయ్యగలనని, తాను కూడా ఇన్ని నువ్వులు చేతిలోకి తీసుకుని, పిండసాగాడు. అతని చేతులు నొప్పిపెట్టాయి తప్ప, ఒక్క చుక్క నూనె రాలేదు.

''ఏం, నూనె పడలేదా?'' అంటూ బండడు తన ఎడమచేతితో గండడి నువ్వుల చేతిని గట్టిగా పట్టుకుని పిండాడు. గండడి చేతి నుంచి నూనెతో బాటు వెచ్చగా, నెత్తురుబొట్లు కూడా కారాయి.

గండడి ప్రాణాలు పోతున్నాయి. చచ్చే బాధ! నొప్పి అనటానికి అభిమానం! చివరకు ఎలాగో గొంతు పెగల్చుకుని, ''చాలు!'' అన్నాడు గండడు.

బండడు గండడి చెయ్యి వదిలి, భోజనం చెయ్యసాగాడు.

''ఇప్పుడే వస్తాను!'' అంటూ గండడు లేచి, మండుతున్న చేతిని ఊదుకుంటూ, చీకటిలోపడి తునిదివాణానికి తిరిగి వెళ్ళిపోయాడు.






# ఉత్తముడి కథ

ఉత్తానపాదుడికి సురుచి అనే భార్య యందు కలిగిన కొడుకు ఉత్తముడు, ధ్రువుడికి సవతి తమ్ముడు. ఉత్తానపాదుడు తన రాజ్యాన్ని ఉత్తముడికే ఇచ్చాడు.

ఉత్తముడు బహుళ అనే ఆమెను పెళ్లాడాడు. అయితే ఆమెకు భర్త అంటే ఏ మాత్రమూ లక్ష్యం లేక, అతన్ని తరచు అవమానించేది. ఉత్తముడు ఆమెను అరణ్యంలో వదిలిరమ్మని తన భటులకు ఆజ్ఞ ఇచ్చాడు.

అరణ్యంలో తిరుగుతూ ఉండిన పాలపోతకుడు అనే నాగుడు ఈమెను చూసి మోహించి, తన ఇంటికి తీసుకుపోయాడు. ఈ నాగుడి కూతురు నంద అనేది, బహుళ తన తల్లికి సవతి అయిపోతుందని భయపడి, ఆమెను ఒక రహస్యప్రదేశంలో దాచి, పోషిస్తూవచ్చింది.

కొంతకాలం గడిచింది. సుశర్మ అనే బ్రాహ్మణుడు ఉత్తముడి కొలువుకు వచ్చి, "నా భార్యను ఎవరో ఎత్తుకుపోయారు. నువు ఆమెను నాకు తిరిగి ఇప్పించు," అని అడిగాడు.

"నీ భార్య ఎలా ఉంటుంది?" అని ఉత్తముడు అడిగాడు.

"నల్లగా, పొట్టిగా, ముసలిగా, కురూపిగా ఉంటుంది," అన్నాడు బ్రాహ్మణుడు.

"అటువంటి దానికోసం ఆరాటపడక పోతే ఇంకొకతెను పెళ్లాడరాదా?" అన్నాడు ఉత్తముడు.

"భార్య ఎటువంటిదైనా భర్త రక్షించుకోవాలి," అన్నాడు బ్రాహ్మణుడు.

సుశర్మ భార్యను వెతికే పని మీద ఉత్తముడు రథమెక్కి అరణ్యాల వెంట తిరుగుతూ, త్రికాలజ్ఞుడనే ముని ఆశ్రమం

మార్కండేయ పురాణకథ

చేరాడు. త్రికాలజ్ఞుడు తన శిష్యుడితో రాజుకు అర్ఘ్యం తీసుకురమ్మన్నాడు.

శిష్యుడు కదలక, "అర్ఘ్యం తీసుకు రావాలో, వద్దో ఆలోచించి మరీ చెప్పండి," అన్నాడు మునితో.

భార్య లేనివాడికి అర్ఘ్యం ఇయ్యరాదన్న సంగతి ముని గుర్తించి, రాజు వచ్చిన పని ఏమిటని అడిగాడు. రాజు సుశర్మ భార్య విషయం చెప్పి, "నా కెందుకు అర్ఘ్యం ఇయ్యలేదు?" అని అడిగాడు.

"సుశర్మ భార్యను బలాకుడు అనే రాక్షసుడు ఎత్తుకుపోయాడు. భార్య లేని వాళ్ళు అర్ఘ్యం ఇయ్యటానికి అర్హులు కారు," అని ముని చెప్పాడు.

ఉత్తముడు బలాకుడు ఉండే చోటుకు వెళ్ళి, సుశర్మ భార్యను చూశాడు.

"ఈ రాక్షసుడు నన్ను తెచ్చాడేగాని, తినటానికీ కాదు, భార్యగా చేసుకోవటానికీ కాదు!" అని ఆమె అన్నది.

ఉత్తముడు రాక్షసుణ్ణి, "నువు ఈ స్త్రీని ఎందుకు తెచ్చావు?" అని అడిగాడు.

రాక్షసుడు రాజుకు ఆతిథ్యమిచ్చి, "ఈమె భర్త రాక్షసులను నాశనం చెయ్యటానికి క్రతువులు చేస్తున్నాడు. భార్య దగ్గర లేకుండా చేస్తే, క్రతువులు చేయలేడుగదా అనుకున్నాను," అన్నాడు.

అయినా ఆమెను తిరిగి ఇయ్యటానికి వాడు ఒప్పుకున్నాడు.

ఉత్తముడు సుశర్మ భార్యతో సహా త్రికాలజ్ఞుడి ఆశ్రమానికి తిరిగివచ్చి, తన భార్య ఎక్కడ ఉన్నదీ చెప్పమని మునిని వేడుకున్నాడు.

"నీ భార్యను పాలపోతకుడు అనే నాగుడు ఎత్తుకుపోయాడు. ఆమెను ఆ నాగుడి కూతురు కాపాడుతున్నది," అని ముని ఉత్తముడితో అన్నాడు.

ఉత్తముడు బలాకుణ్ణి పంపి తన భార్యను తెప్పించుకున్నాడు.

అటు తరవాత బహుళ తన భర్తకు అనుకూలంగా ఉంటూ, ఉత్తముడు అనే కొడుకును కన్నది. అతడే ఉత్తమ మనువు.



# ప్రార్థనా మహిమ



అంబరీషుడు అనే రాజు కోసలదేశాన్ని ఏలుతూండగా అతిదీర్ఘక్షామం సంభవించింది. నదులూ, బావులూ ఎండిపోయాయి. పంటలు పండలేదు.

అశ్వమేధయాగం చేసినట్టయితే వర్షాలు కురిసి, కరువు తొలిగిపోతుందని రాజుకు మంత్రులూ, పురోహితులూ చెప్పారు. అది ఎంతో జాగరూకతతో చెయ్యవలసిన యజ్ఞం.





ఈ యజ్ఞం కోసం సర్వలక్షణ సమన్వితమైన గుర్రాన్ని తెచ్చి, దాన్ని చక్కగా కడిగి, అలంకరించి, బలి ఇయ్యటానికి సిద్ధం చేశారు.



అంబరీషుడు ఇంద్రత్వం కోరి యజ్ఞం చేస్తున్నాడనుకుని, యజ్ఞాన్ని విఘ్నం చెయ్యటానికి యాగాశ్వాన్ని దేవతలు హరించారు.



యాగాశ్వం అదృశ్యమయిందని తెలిసి, రాజూ, పురోహితులూ చాలా కలవరపడి, దాని కోసం వెతికించారు. రాజభటులు అశ్వం కోసం అరణ్యాలూ, కొండలూ, అంతటా వెతికారు, కాని అది దొరకలేదు.



అశ్వాన్ని పోగొట్టుకుని విచారంగా ఉన్న రాజుతో పురోహితులు, ఈ పరిస్థితిలో అశ్వానికి బదులుగా ఎవరైనా బ్రాహ్మణ బాలుణ్ణి బలి ఇయ్యటం తప్ప మార్గాంతరం లేదని చెప్పారు.

తగిన లక్షణాలు కలిగి, బలిపశువుగా లభ్యం అయే బ్రాహ్మణ బాలుణ్ణి సంపాదించట మంటే మాటలుకాదు. వెతకగా, వెతకగా రుచికుడు అనే మునికి ముగ్గురు కుమారులున్నట్టు తెలిసి, రాజు ఆయన వద్దకు వెళ్ళాడు.





రుచికుడు తన పెద్ద కొడుకును ఇయ్యటానికి ఎంత మాత్రమూ ఒప్పుకోలేదు. రుచికుడి భార్య తన చిన్నకొడుకును ఇయ్యనన్నది. మధ్యవాడైన శునశ్శేపుడు బలిపశువుగా ముందుకు వచ్చాడు.

రాజు తృప్తిపడి, శునశ్శేపుణ్ణి వెంటబెట్టుకుని తన ఇంటికి బయలుదేరాడు. మధ్య దారిలో వారికి విశ్వామిత్రుడి ఆశ్రమం తగిలింది. విశ్వామిత్రుడు శునశ్శేపుడి నుంచి, అతను బలిపశువు కాబోతున్నాడని విని జాలిపడ్డాడు.





విశ్వామిత్రుడు శునశ్శేపుడికి ఒక మంత్రం ఉపదేశించి, దాన్ని పఠించి నట్టయితే ఆపద తప్పుతుందనిచెప్పాడు. రాజు శునశ్శేపుణ్ణి తెచ్చి, బలికి సిద్ధం చేయించాడు.



శునశ్శేపుడు బలికి తీసుకు పోబడుతూ, విశ్వామిత్రుడు ఉపదేశించినమంత్రాన్ని చదివాడు. ఎక్కడి వారక్కడ కొయ్యబారి నిలబడిపోయారు.



ఆకస్మాత్తుగా అగ్నిగుండంలో ఇంద్రుడు ప్రత్యక్షమై, అంబరీషుడికి యజ్ఞఫలం ఇప్పించి, శునశ్శేపుణ్ణి విడిపించాడు. దేవతలు కాపాడిన కారణంగా, శునశ్శేపుడికి దేవరాతు డనే పేరువచ్చింది.




# దేవయాని

ఇతరుల తపస్సు పాడుచెయ్యటానికి ఇంద్రుడు చేసిన ప్రయత్నాలు కొన్ని ఫలించాయి, కొన్ని ఎదురు తిరిగాయి.

శుక్రుడు ఘోరమైన తపస్సు చేస్తూంటే దాన్ని విఘ్నం చెయ్యటానికి ఇంద్రుడు తన కుమార్తె అయిన జయంతినే పంపాడు. కాని శుక్రుడి తపస్సుకు విఘ్నం కలగలేదు. ఆయన తపస్సు పూర్తి కావటమేగాక, బ్రహ్మ ఆయనకు వరాలు కూడా ఇచ్చాడు. అయితే జయంతి వచ్చిన పని కూడా వృథా కాలేదు. ఆమె శుక్రుడితో సంసారం చేసి, దేవయాని అనే కూతుర్ని కన్నది!

దేవదానవుల యుద్ధమప్పుడు, శుక్రుడి నుంచి మృతసంజీవనీ విద్య నేర్చుకోవటానికి కచుడు వచ్చి తన తండ్రికి శుశ్రూష చేసే కాలంలో దేవయాని అతన్ని గాఢంగా ప్రేమించింది. కచుణ్ణి రాక్షసులు ఎన్నిసార్లు చంపినా, తన తండ్రిచేత ఆమె అతన్ని బతికింపజేసుకున్నది. కచుడు దేవయాని ధర్మమా అంటూ అనేకసార్లు చచ్చి బతకటమేగాక, రాక్షసులు చేసిన చిన్న పొరపాటువల్ల మృతసంజీవనీ విద్య కూడా నేర్చుకోగలిగాడు.

తాను వచ్చిన పని సానుకూలం కావటానికి దేవయాని ఎంతగానో తోడ్పడినప్పటికీ, కచుడు దేవయాని ప్రేమను నిరాకరించి, గురుపుత్రిక చెల్లెలితో సమానం గనక ఆమెను పెళ్ళాడనన్నాడు.

శుక్రుడు వృషపర్వుడు అనే దానవ రాజు నగరంలో ఉంటూండేవాడు. వృషపర్వుడికి శర్మిష్ఠ అని ఒక కూతురు ఉండేది. దేవయాని ఆమెతో స్నేహంగా ఉండేది.

ఒక రోజు శర్మిష్ఠా, దేవయానీ, వారి చెలికత్తెలూ కొలనులో జలకాలాడబోయి,

తమ బట్టలను విప్పి, గట్టున పెట్టారు. వారు స్నానం చేస్తూండగా, గాలివచ్చి బట్టలన్నీ కలిసిపోయాయి. శర్మిష్ఠ కొలనులో నుంచి బయటికి వచ్చి, చేతికి అందిన బట్ట తీసి కట్టుకున్నది. అది దేవయాని బట్ట!

తరవాత దేవయాని స్నానం ముగించి వచ్చి, ''నేను బ్రాహ్మణ స్త్రీని! మా తండ్రి నీ తండ్రికి కులగురువు! నువ్వు నా బట్ట కట్టేసుకుని, నీ బట్టను నన్ను కట్టుకోమన్నావా?'' అని శర్మిష్ఠతో పోట్లాట వేసుకున్నది.

''నీ ఎక్కువేమిటి? మా నాన్న కింద నీ తండ్రి సేవకుడు! ఏం చూసుకుని నీ కళ్లు నెత్తికి వచ్చాయి?'' అంటూ శర్మిష్ఠ దేవయానిని దారిలో ఒక బావిలోకి తోసి, తన ఇంటికి చెలికత్తెలతో వెళ్ళిపోయింది.

నూతిలో పడి దేవయాని ఏడుస్తూంటే అటుగా వేటకు వచ్చిన యయాతి ఆమెను తన చెయ్యి అందించి బయటికి తీశాడు.

ఈ లోపుగా దేవయానిని వెతుకు[illegible] ఘూర్ణిక అనే పరిచారిక వచ్చింది. అయితే దేవయాని శర్మిష్ఠ ఉండే నగరానికి వెళ్ల నిరాకరించింది. ఈ సంగతి తెలిసి శుక్రుడు కూడా వృషపర్వుడి నగరాన్ని విడిచి వెళ్ళటానికి సిద్ధపడ్డాడు.

అప్పుడు వృషపర్వుడు తన కూతురి తప్పు తెలుసుకుని, ఆమెను దేవయానికి బానిసగా ఇచ్చేశాడు.

యయాతి తన చెయ్యి పట్టుకోవటంచేత పాణిగ్రహణం జరిగిందనీ, అతనే తన భర్త అనీ వాదించి, దేవయాని అతన్ని పెళ్ళాడింది. ఆమె కాపరానికి వెళ్ళేటప్పుడు శర్మిష్ఠ కూడా ఆమె వెంట వెళ్ళింది. యయాతికి దేవయాని పిల్లలను కనలేకపోయిందిగాని, యయాతి రహస్యంగా శర్మిష్ఠకు కొడుకులను కన్నాడు.

ఈ సంగతి దేవయానికి చాలా కాలానికిగాని తెలియలేదు. అప్పుడు ఆమె తన తండ్రితో చెప్పి, యయాతికి వృద్ధాప్యం వచ్చేటట్టు శపింపజేసింది.



# దొంగను పట్టిన దొంగ

రామాపురంలో పట్టపగలే అతి విచిత్రమైన దొంగతనాలు జరగసాగాయి. కాని రాజభటులకు దొంగను పోల్చడం చాలా కష్టమయింది. ఎందుకంటే, దొంగ నగరంలోని వేరు వేరు ప్రాంతాల ఒకే కాలంలో దొంగతనాలు చేస్తున్నట్టు కనబడ్డాడు. వాడికోసం ఎక్కడ మాటు వెయ్యాలో రాజభటులకు తెలియలేదు.

దానికి కారణం, దొంగతనాలు చేస్తున్నవాళ్ళు ఇద్దరు గజదొంగలు, భీమన్నా, గంగన్నా అనేవాళ్ళు. ఇద్దరూ చోరవిద్యలో సిద్ధహస్తులు కావటంలో తోడుదొంగలుగా పని చెయ్యటానికి ఇద్దరికీ ఇష్టం లేకపోయింది. అయితే ఒకరు మరొకరికి ప్రతిబంధకంగానూ, పోటీగానూ ఉండటంవల్ల, ఒకరి నొకరు ఎలా అణగార్చాలా అని చూస్తున్నారు.

దొంగను పట్టటం తనకు సాధ్యంకాదని తోచి రాజు, దొంగను పట్టి ఇచ్చినవాడికి పదివేల వరహాలు బహుమతి ఇస్తానని చాటింపు వేయించాడు. వెంటనే భీమన్నా, గంగన్నా మారు వేషాలలో రాజు వద్దకు వెళ్ళి, ఒకరి ఆచూకీ మరొకరు తెలియబరిచారు. ఆ విధంగా ఇద్దరూ దొరికిపోయారు. బహుమతి ఎవరికీ చెందలేదు.

—జి. ఉదయకుమార్






రఘుపతి ఉండే ఊరు పట్టణానికి పది మైళ్ళ దూరాన ఉంటుంది. అతని ఇంట ఏదో శుభకార్యం జరగబోతున్నది. దాని కోసం అతని స్నేహితుడు శ్రీకంఠుడు చీకటిపడి గుర్రపుబండి కట్టించుకుని రఘుపతి ఉండే ఊరికి బయలుదేరాడు.

పట్టణానికీ, రఘుపతి ఉండే ఊరికీ మధ్య చిట్టడవి ఉన్నది. ఈ అడవిలో కొంతకాలం క్రితం రఘుపతిని దొంగ దోచాడు. అది ఎలా జరిగినదీ రఘుపతి శ్రీకంఠుడికి లోగడ చెప్పాడు.

రఘుపతి ఏదో పని మీద పట్నం వచ్చి, త్వరగా తెమలక, చీకటిపడి తన ఊరికి బయలుదేరుతూ, గుర్రపుబండి మాట్లాడుకున్నాడుట. బండి చిట్టడవిలో చాలా దూరం వెళ్ళి ఒక మలుపు తిరిగేసరికి దారికి అడ్డంగా ఒక చెట్టుకొమ్మ పడి ఉన్నది. బండి ఆగిపోయింది.

ఒక చెట్టు వెనకనుంచి ముసుగు మనిషి ఒకడు పదునైన కత్తితో వచ్చి, రఘుపతి మెడకు కత్తిమొన అనించి, ''ఉన్నదంతా ఇచ్చెయ్యి,'' అని డబ్బంతా తీసుకుని, బండివాడి జేబులో ఉన్నది కూడా తీసుకుని, చెట్లచాటుకు వెళ్ళాడు.

''చీకటి ప్రయాణం వద్దంటే విన్నారు కారు. నా కూతురి పెళ్ళికి కూడబెట్టిన అయిదు వందలూ దొంగ కాజేశాడు,'' అని బండివాడు లబలబలాడాడు.

రఘుపతి తన ఊరు చేరినాక, బండి వాడికి అయిదు వందలూ ఇచ్చేసి, ఆ రాత్రి వాణ్ణి తన ఇంటనే ఉంచుకుని, మర్నాడు పంపేశాడు.

ఏడాది క్రితం జరిగిన ఈ సంఘటన గురించే ఇప్పుడు గుర్రపు బండీలో రఘుపతి ఊరికి చీకట్లోపడి పోతున్న శ్రీకంఠం ఆలోచిస్తున్నాడు.

మాచిరాజు కామేశ్వరరావు

ఇంతలో బండి అడవి చాలాభాగం దాటి ఒక మలుపు తిరిగేసరికి, దారికి అడ్డంగా ఒక చెట్టు కొమ్మ పడి ఉన్నది. బండి ఆగిపోయింది. ఒక చెట్టు చాటు నుంచి ముసుగు మనిషి కత్తితో వచ్చి శ్రీకంఠుడి కంఠానికి కత్తి ఆనించి, అతని దగ్గిర ఉన్నదంతా ఊడ్చేసి, బండివాడి జేబులో ఉన్నది కూడా తీసుకుని, పోతూ, పోతూ శ్రీకంఠుడితో, "నీ దగ్గిర ఉన్న ఆ మూట ఏమిటి?" అని అడిగాడు.

"చక్రపొంగలి! పిల్లల కోసం తీసుకు వెళుతున్నాను." అన్నాడు శ్రీకంఠుడు.

"ఆకలి మండిపోతున్నది! చక్ర పొంగలి పెద్దలు కూడా తినవచ్చు." అంటూ దొంగ మూటతోసహా పారి పోయాడు.

దొంగ వెళ్లగానే, బండివాడు, "నా కూతురి పెళ్లి కోసం పోగుచేసిన అయిదు వందలూ దొంగ కాజేశాడు!" అని లబ లబ లాడాడు.

రఘుపతి అనుభవమే మళ్లీ జరుగు తున్నది. బండివాడు కూడా తోడుదొంగే నన్నమాట!

బండివాడు చెట్టుకొమ్మ దారికి అడ్డం తొలగించి, బండిని ముందుకు నడిపించ బోతూండగా శ్రీకంఠుడు, "కొంచెం ఆగు!" అన్నాడు.



"ఇంకా ఎందుకు? మరో దొంగ రావటానికా?" అని బండివాడు అడిగాడు.

"రానీ! మన దగ్గిర దోచుకోవడానికి ఇంకేమున్నదీ? అయినా నా డబ్బూ, నీ డబ్బూ ఎక్కడికీ పోవులే! త్వరలోనే అవి మనకు తిరిగి వస్తాయి. అందుకే ఆగమన్నాను," అన్నాడు శ్రీకంఠుడు.

"అది ఎలా సాధ్యం?" అని బండి వాడు అడిగాడు.

శ్రీకంఠుడు విరగబడి నవ్వి, "ఆ చక్ర పొంగలి పిల్లల కోసం తీసుకుపోతున్నది కాదు, ఎలకల కోసం తీసుకుపోతున్నది! నా స్నేహితుడి ఇంటి నిండా ఎలకలేట! పట్నంలో మంచి ఘాటయిన మందు

తెమ్మన్నాడు. దొంగ దాన్ని తిని త్వర లోనే చస్తాడు. మనం వెళ్ళి మన డబ్బు తెచ్చుకోవచ్చు.'' అన్నాడు.

ఈ మాట విని బండివాడు తెల్లబోయి, గజగజ వణుకుతూ, ''రంగా, పొంగలి తినకురా!'' అని గట్టిగా అరుస్తూ, బండి మీది నుంచి కిందికి దూకాడు.

శ్రీకంఠుడు చప్పున వాడి పీక పట్టు కుని, ''దొంగ పీనుగా, దారిదోపిడీలో నీకూ్కడా భాగం ఉన్నదా?'' అన్నాడు.

''బుద్ధి గడ్డి తిని ఇలా మొదలు పెట్టాం. నన్ను వదలండి. నా కొడుకు పొంగలి తిని చస్తాడో ఏమో!'' అన్నాడు బండివాడు అందోళనతో.

ఇద్దరూ సమీపంలో ఉన్న పాకను చేరుకున్నారు. బండివాడు తొందరగా తలుపు తోసుకుని లోపల ప్రవేశించాడు. వాడి వెనకనే శ్రీకంఠుడు కూడా లోపలికి వెళ్ళాడు.

లోపల బండివాడి కొడుకు ఆవురావురు మని సగం పొంగలి అప్పటికే తినేశాడు.

''అందులో ఎలకలమందు ఉన్నదిరా, నాయనా! తినేశావా?'' అన్నాడు బండి వాడు ఏడుపు గొంతుతో.

''ఏడిస్తే విషం విరగదు. నా మిత్రు డింటికి పద. వైద్యుడి చేత విరుగుడు చేయిస్తాం!'' అన్నాడు శ్రీకంఠుడు.

సంగతి తెలియగానే రంగడికి నీర సమూ, చెమటలూ ప్రారంభమయాయి. కడుపులో తిప్పడం ఆరంభమయింది.

ముగ్గురూ బండిలో రఘుపతి ఇంటికి చేరారు. శ్రీకంఠుడు తండ్రి కొడుకులను వీధిగదిలో కూర్చబెట్టి, ''ఇక్కడే ఉండండి. వైద్యుడికి కబురు పెట్టు తున్నాం,'' అని లోపలికి వెళ్ళి, రఘు పతికి జరిగినదంతా చెప్పాడు.

వైద్యుడి కోసం ఎదురుచూస్తున్న తండ్రి కొడుకుల కోసం రక్షకభటులు వచ్చి, వాళ్ళను పట్టుకుపోయారు. వెళ్ళేటప్పుడు శ్రీకంఠుడు వాళ్ళతో, ''పొంగలిలో ఏ విషమూ లేదు. కాని మీ రోగానికి చికిత్స చేసే వైద్యులు వీళ్ళే!'' అన్నాడు.



# పరీక్ష

వజ్రాల వ్యాపారి వరహాలశెట్టి తన వ్యాపారాన్ని తన ఇద్దరు కొడుకులలో ఎక్కువ తెలివైనవాడికి అప్పగించదలచి, ఇద్దరికీ చెరొక చౌకబారు వజ్రమూ ఇచ్చి, అవి మేలుజాతివని చెప్పి, వాటిని అమ్ముకురమ్మన్నాడు.

పెద్దవాడు తిరిగివచ్చి, "ఎవరో నిన్ను మోసం చేశారు! అది నకిలీ వజ్రమట. పది వరహాలకన్న రాలేదు," అన్నాడు.

చిన్నవాడు వచ్చి, "అది నకిలీ వజ్రం! నువు పొరపాటున ఇచ్చి ఉంటావు. అయినా దాని నమూనా గొప్పగా ఉన్నదని చెప్పి, నూరు వరహాలకు అమ్మాను," అన్నాడు.

"మీరు అమ్మినవి విలువైన వజ్రాలు. ఇవి నకిలీవి! వీటిని అమ్ముకురండి," అని శెట్టి తన కొడుకులకు మంచి వజ్రాలిచ్చాడు.

పెద్దవాడు తిరిగివచ్చి, "మొదట నువు ఇచ్చిన అసలు వజ్రానికి రెండోసారి ఇచ్చిన నకిలీ వజ్రం మార్పిడి చేసి, నష్టం పూడ్చాను," అంటూ నకిలీ వజ్రాన్ని తండ్రికి ఇచ్చాడు.

రెండోవాడు తిరిగివచ్చి, "ఇదే అసలు వజ్రం! దాన్ని పదివేల వరహాలకు అమ్మాను. ఎందుకైనా మంచిదని, ముందు అమ్మిన వజ్రానికి మరో పది వరహాలు అదనంగా ఇచ్చి కొని, దాన్నికూడా తెచ్చాను," అన్నాడు.

శెట్టి తన వ్యాపారాన్ని రెండో కొడుక్కు అప్పగించాడు. —పి. వి. వి. కె. సుబ్బారావు





# పండితుడి శిష్యులు

గోవిందుడు ఒక పండితుడి ఇంట పని చేసేవాడు. తాను కూడా చదువుకోవాలనే కోరిక వాడిలో తీవ్రంగా ఉండేది. అందు చేత వాడు తరచుగా తన పని మరిచి పోయి, పండితుడు శిష్యులకు చెప్పే పాఠాలు ఆలకించేవాడు.

ఒకసారి వాడు ఇలాగే పండితుడు శిష్యులకు చెప్పే పాఠం వింటూ చెయ్య వలసిన పనులు మరిచిపోయేసరికి, అది గమనించి పండితుడి భార్య వాణ్ణి నానా మాటలూ అన్నది.

''పనిమాని ఏమి వింటున్నావురా?'' అని పండితుడు వాణ్ణి అడిగాడు.

"నాకూ్కడా చదువుకోవాలని కోరిక," అన్నాడు గోవిందుడు.

''నీ కోరిక మంచిదే. కాని నీకు అందుకు తగిన అర్హత ఉన్నదా? ఇప్పుడు నేను ఏం పాఠం చెబుతున్నానో చెప్పు. అలా చెప్పగలిగితే నిన్ను నా శిష్యులలో చేర్చుకుంటాను,'' అన్నాడు పండితుడు వాడితో.

ఆయన అలా అనటానికి కారణం ఉన్నది. ఆ రోజు ఆయన బోధిస్తున్న విషయం చాలా కష్టమైనది. వింటున్న శిష్యులలో ఒక్కడికి అది ఇంకా పూర్తిగా అర్థం కాలేదు. గోవిందుడికి అది కొంచె మైనా అర్థం అవుతుందని ఆయన ఊహించ లేదు.

కాని గోవిందుడు దాన్ని అర్థంచేసుకుని, తాను విన్నది ఒక్క ముక్క పొర్లు పోకుండా చెప్పాడు.

పండితుడు వాడి గ్రహణశక్తిని మెచ్చు కుని, ఆ రోజు నుంచీ వాణ్ణి తన శిష్యులలో చేర్చుకున్నాడు. త్వరలోనే గోవిందుడు పండితుడి శిష్యులందరినీ మించి పోయాడు.

"వసుంధర"

శిష్యులు వాడి మీద తమకు గల అసూయను గురువుగారి దగ్గిర వెళ్ళబోసుకున్నారు.

"నేనేం చేసేది? వాడు సరస్వతీదేవి అవతారంలా ఉన్నాడు. వాడు నన్నే మించిపోయేటట్టుగా వున్నాడు!" అన్నాడు పండితుడు.

విద్యాభ్యాసం చేస్తూండగానే గోవిందుడికి కవిత్వం అబ్బింది. వాడి కవిత్వానికి ఎంతో ఖ్యాతి వచ్చింది. గొప్పగొప్పవాళ్ళు వాణ్ణి తమ ఇళ్ళకు ఆహ్వానించి, కవితా గోష్ఠి జరిపించి, గొప్పగా సత్కరించసాగారు.

ఇదంతా చూసి పండితుడి శిష్యులకు కన్నెఱ్ఱగా ఉండేది.

ఇది చాలనట్టు గోవిందుడు ఒక నాట్యశాల వారికి నాటకం ఒకటి రాసిపెట్టాడు. దాన్ని ప్రదర్శించగా చూసినవారందరూ అద్భుతం అన్నారు. అప్పటినుంచీ గోవిందుడు సంస్కృత నాటకాలు అనేకం రాశాడు. వాటికి పుష్కలంగా డబ్బు కూడా వచ్చింది.

క్రియకు పండితుడి పేరు నిలబెట్టిన శిష్యుడు గోవిందుడు ఒక్కడే అయినాడు. మిగిలిన శిష్యులలో ఒక్కడూ ప్రయోజకుడు అనిపించుకోలేదు.

వారందరూ ఏకమై, "పనిచేసుకుని రెక్కల కష్టం మీద బతకవలసినవాడు మన గురువుగారి చలవ వల్ల మహాకవి అయి కూర్చున్నాడు. మనకేమో కవిత్వం



అబ్బలేదు. అదిచూసి గోవిందుడు మరీ మిడిసిపడుతూ ఉండాలి. వాడి గర్వాన్ని అణచాలంటే, మనం ఇతర ప్రాంతాల నుంచి గొప్ప కవులను ఇక్కడికి ఆహ్వానించి ఘనంగా సత్కరించాలి,'' అనుకున్నారు.

ఈ పథకం కింద కొందరు శిష్యులు ఆంధ్రదేశానికి వెళ్ళారు. ఆ రోజులలో ఆంధ్రదేశంలో నాటకాలకు బహుళ ప్రచారం ఉండేది. అక్కడి ప్రజలు ఆదరించిన నాటకాలలో కొన్ని చాలా కీర్తి తెచ్చుకున్నాయి. అలా నాటకరచనలో కీర్తి గడించుకున్న ఆంధ్రనాటకకర్తలలో శ్రేష్ఠుడు భద్రకవి.

పండితుడి శిష్యులు భద్రకవిని కలుసుకుని, ''మీ దేశంలో మీ నాటకాలంటే అందరూ ఎంతగానో అభిమానిస్తారని విన్నాం. కొన్నిటిని ప్రదర్శించగా మేం చూశాం. తమరు వాటిని సంస్కృతంలో అనువదించి ఇచ్చినట్టయితే, మేం మా దేశంలో ప్రదర్శింపజేస్తాం. మీకు అక్కడ కూడా అఖండ ఖ్యాతి లభిస్తుంది!'' అన్నారు.

భద్రకవి వారికి ధన్యవాదాలు చెప్పుకుని, ''నా నాటకాలన్నిటికీ సంస్కృత మాతృక లున్నవి. నేను వాటిని ఆంధ్రీకరించాను, అంతే!'' అన్నాడు.

''సంస్కృతంలో వాటిని రచించిన మహాకవి ఎవరు?'' అని పండితుడి శిష్యులు అడిగారు.

''ఆ మహాకవి ఉండే నగరం ఉజ్జయిని. అతని పేరు గోవిందుడు,'' అన్నాడు భద్రకవి.

శిష్యులకు చచ్చేటంత అవమానమయింది. దేశదేశాలవాళ్ళూ గోవిందుడి నాటకాలను తమ భాషలలోకి తర్జుమా చేసుకుని ఆనందిస్తూంటే, తాము ఆ నాటకాలను వదలిపెట్టి, ఇతర ప్రాంతాల తిరుగుతున్నారు! అసూయ ఎంతపనైనా చేయిస్తుంది అనుకుని, వాళ్ళు బుద్ధితెచ్చుకుని, వెంటనే తమ నగరానికి తిరిగి వెళ్ళారు.



# పాపవిమోచన

ఒక గ్రామంలో సింగన్న అనే దొంగ తాను చాలా పాపం చేసినట్టు గుర్తించి, ఆ పాపానికి పరిహారం ఏమిటా అని ఆలోచిస్తూండగా ఆ గ్రామానికి ఒక దొంగ స్వాములవారు వచ్చాడు. అతను తన బోధలు వినటానికి వచ్చిన గ్రామస్థులతో, "భక్తులారా! మనుషులు ఎందుకు మోసాలు చేస్తారు? తమ అవసరాలను తీర్చుకునేటందుకు! అలా చేసిన పాపానికి విరుగుడు ఏమిటంటే తమ అక్రమ సంపాదనలో సగం దైవకార్యాలకు వినియోగించటం. మోసగాళ్ళకు పాపవిమోచన కలగగలందులకు ఇక్కడ హుండీ ఒకటి పెట్టాం. మీ అక్రమ సంపాదనలో సగం ఈ హుండీలో వేసి పాపవిముక్తి పొందండి," అని బోధించాడు.

అనేకమంది పాపవిమోచనం కోసం తమ అక్రమసంపాదనలో సగం స్వాములవారి హుండీలో వేశారు.

మర్నాడు ఉదయం స్వాములవారి శిష్యులు హుండీ తీసి చూస్తే అందులో ఒక చీటీ ఉన్నది. దానిలో ఇలా ఉన్నది:

"స్వామీ, నేను నా అవసరంకోసం మీ హుండీ అంతా దోచేసి, అందులో సగం తిరిగి హుండీలో వేశాను. దాన్ని దైవకార్యాలకు వినియోగించి, నాకు పాపవిమోచన కలిగించండి—సింగన్న!"

—ఎస్. అగ్బల్





# అప్పు తీర్చిన అప్పు

దశయ్య ఊళ్ళోకెల్లా పెద్ద భూస్వామి. తన కూతురి పెళ్ళి సందర్భంగా ఆయన ప్రసిద్ధ నగల వర్తకుడైన మునిస్వామి దగ్గిర యాభైవేల రూపాయలకు నగలు కొని, చేతిలో ఉన్న నలభై వేలూ ఇచ్చి, మిగతాది వీలు చూసుకుని సర్దుతానని చెప్పాడు.

మునిస్వామి దశయ్యను బాగా ఎరుగును, అందుచేత దశయ్యకు నగలు ఇచ్చేశాడు. అయితే దశయ్య తనకు పది వేలు బాకీ ఉన్న సంగతి ఎక్కడా గుర్తుగా రాసుకోకపోగా, భారీ వర్తకం మీదవేసుకుని సతమతమవుతూ ఆ బాకీ మాట పూర్తిగా మరిచేపోయాడు.

దశయ్య మాత్రం తాను మునిస్వామికి పదివేలు బాకీ ఉన్న సంగతి మరిచిపోలేదు. కాని అతనికి కాలం కలిసి రాలేదు. ఆర్థికంగా తీరని చిక్కులు ఏర్పడ్డాయి. వీటితోబాటు దశయ్య ఆరోగ్యం చెడి, మంచాన పడ్డాడు. ఆఖరు క్షణంలో ఆయన తన కొడుకు మురళితో, "నాయనా, అక్క పెళ్లికి నగలు కొంటూ నగల వర్తకుడు మునిస్వామికి పదివేలు బాకీ పడ్డాను. అది తీర్చే లోపల మన స్థితి చితికిపోయింది. నేను ఖాయిలా పడ్డాను. ఆ బాకీ తీరనే లేదు. ఎప్పటికైనా నువు ఆ బాకీ తీర్చితేగాని నా ఆత్మకు శాంతి ఉండదు. తీర్చుతానని మాట ఇయ్యి," అన్నాడు.

మురళి తండ్రి చేసిన బాకీ తీర్చుతానని ప్రమాణం చేసినాక దశయ్య కన్ను మూశాడు.

మురళి తన బతుక్కు కొత్త పునాది వేసుకోవలసి వచ్చింది. అతను అహోరాత్రాలు శ్రమపడి, చిల్లర డబ్బులు కూడబెట్టడమే కాక, తన పొట్టకట్టుకుని

కె. శరత్‌చంద్రరెడ్డి

అయినా తండ్రి చేసిన బాకీ తీర్చటానికి డబ్బు వెనకవేస్తూ వచ్చాడు.

చివరకు ఎలాగైతేనేం, అతని దీక్ష ఫలించి, పదివేల రూపాయలు పోగ యాయి. మురళి దాన్ని తీసుకుని మునిస్వామి ఇల్లు వెదుక్కుంటూ వెళ్ళాడు. ఆ ఇంట్లో ఎవరో యువకుడు ఉండి, ''ఎవరు మీరు? ఏం కావాలి?'' అని అడిగాడు.

''మునిస్వామిగారున్నారా?'' అని మురళి ఆ యువకుణ్ణి అడిగాడు.

''మునిస్వామిగారు చనిపోయి చాలా కాలమయిండి. పోతూ. పోతూ ఆయన తన కొడుక్కు తన బాకీలు అప్పజెప్పి పోయాడు,'' అన్నాడు యువకుడు.

''ఇప్పుడు మునిస్వామిగారి కొడుకు ఎక్కడ ఉన్నాడు?'' అని మురళి మళ్ళీ అడిగాడు.

''తండ్రి చేసిన బాకీలు తీర్చలేక, ఆ అబ్బాయి ఇల్లు వదిలి పరారీ అయి కూడా చాలాకాలం అయింది,'' అన్నాడు యువకుడు.

ఈ మాటలు విని మురళి ఆశ్చర్య పోయాడు.

''మునిస్వామిగారు పేరు మోసిన నగల వర్తకుడని చెప్పారే, అలాటివాడు అప్పులపాలు కావటం ఎలా జరిగింది?'' అని మురళి అడిగాడు.

దానికా యువకుడు, ''ఎలా జరిగిం దంటే, ఏం చెప్పాలి? నిక్షేపంలాటి నగల



వర్తకంతో తృప్తిలేక ఆయనగారు సముద్ర వ్యాపారంలోకి దిగాడు. ఆయన సరుకులు సముద్రంలో మునిగాయి. వాటితో పాటు ఆయనా మునిగాడు! బాకీలు మాత్రం మిగిలాయి!'' అన్నాడు యువకుడు కటువుగా.

''అయ్యో, పాపం! ఎంత అన్యాయం జరిగిపోయిందీ! మునిస్వామిగారు నగల వ్యాపారం చేసే రోజుల్లో మా నాన్న ఆయనకు పదివేలు బాకీ పడ్డాడు. మునిస్వామిగారి లాగే మా నాన్నకూ కాలం కలిసిరాక, ఉన్నదంతా పోయింది. ఆఖరు క్షణంలో ఆయన నాకు ఈ బాకీ తీర్చే భారం అప్పగించి కన్నుమూశాడు. నేను పదివేలు మిగిల్చి, నా తండ్రి ఋణం తీర్చటానికి ఇంతకాలం పట్టింది. మునిస్వామిగారు లేకపోతే మానె, ఆయన కొడుకు కూడా లేడే? ఈ డబ్బు ఎవరికియ్యను? మునిస్వామిగారి పేర సత్రం కట్టించి, మా తండ్రి ఆత్మకు శాంతి కలిగిస్తాను,'' అన్నాడు మురళి.

వెంటనే ఆ యువకుడు, ''అయ్యా, మునిస్వామి కొడుకు ఎక్కడికీ పోలేదు. నేనే మునిస్వామి కొడుకును. మీరు కూడా మా తండ్రి బాకీ వసూలు చెయ్యటానికి వచ్చారని భయపడి మీతో అలా అబద్ధమాడాను,'' అన్నాడు.

మురళి ఈ మాటకు నొచ్చుకుని, ''అయ్యా, తండ్రి చేసిన అప్పులకు అలా భయపడాలా? కష్టపడి అయినా తండ్రి బాకీలు తీర్చి, ఆయన పరువు నిలపటం కొడుకు ధర్మం కాదా? మా తండ్రి బాకీ తీర్చటానికి నేను ఎంత శ్రమపడ్డాను! ఈ డబ్బు పెట్టుబడిగా పెట్టుకుని, డబ్బు సంపాదించి, మీ తండ్రిగారి బాకీలు తీర్చు. అంతేగాని ఆ అప్పులు భారంగా ఎంచకు!'' అంటూ అతనికి పదివేలూ ఇచ్చేశాడు.

మునిస్వామి కొడుకు ఆ డబ్బుతో వ్యాపారం చేసి, లాభాలు గడించి, కొంతకాలానికి తన తండ్రి చేసిన అప్పులన్నీ తీర్చేశాడు.





# దేవీ భాగవతం

పరదేవత అయిన ఆదిశక్తిని ఆరాధించి, వరాలు పొందిన వారు ఎందరో ఉన్నారు.

పూర్వం సురథుడు అనే రాజు విశాలమైన రాజ్యాన్ని పాలించేవాడు. అతను చెయ్యని పుణ్యం లేదు, పాటించని నీతి, నియమమూ లేదు. అన్నివిధాలా సమర్థుడైన సురథుడి మీద కొండజాతుల వాళ్ళూ, యవనతెగలవాళ్ళూ, పెద్ద సేనలను పోగుచేసుకుని దండెత్తి వచ్చారు.

యుద్ధంలో శత్రువుల బలం అధికమై, సురథుడికి అపజయం కలిగింది. అతను తన కోటకు తిరిగి వచ్చి, తన మంత్రులు శత్రుపక్షం అయినారని తెలుసుకుని, దైవం అనుకూలించక పోవటం చింతించి, తనలో ఇలా అనుకున్నాడు:

"మంత్రులు దుర్మార్గానికి ఒడిగట్టినాక, వారిని నమ్మకోవటం ప్రమాదకరం. వాళ్ళు నన్ను తీసుకుపోయి శత్రువుల చేతికి అప్ప జెప్పుతారు. దుర్జనుడు ఎంత క్రూరత్వానికైనా ఒడిగట్ట గలడు. వాడికి నీతినియమా లెందుకుంటాయి? అలాటి వాళ్లు తాతా, తల్లీ, తండ్రీ, స్నేహితుడూ, చుట్టమూ అన్నది కూడా పాటించరు!"

ఇలా అనుకుని సురథుడు వేగవంతమైన గుర్రం మీద కీకారణ్యాల కేసి వెళ్లిపోయాడు. అవి కాకులు దూరనికారడవి. దట్టంగా తీగలు అల్లుకుని ఉన్న చెట్ల మధ్యగా నదులు ప్రవహిస్తున్నాయి. పులులూ, సింహాలూ, ఏనుగులూ, లేళ్లూ మొదలైన మృగాలు స్వేచ్ఛగా తిరుగు

## 16. సురథుడి కథ



తున్నాయి. అంతటి కీకారణ్యం మధ్యనూ బ్రహ్మచారుల వేదపాఠాలు వినవస్తున్నాయి. హోమం చేసిన నీవారధాన్యపు సువాసనలూ, బాగా పండిన పండ్ల వాసనలూ తెలుస్తున్నాయి. ఇవి కొంచెం దూరంలో వున్న ఒక ముని ఆశ్రమాన్నుంచి వెలువడుతున్నాయి.

సురథుడు ఆ ఆశ్రమం కేసి వెళ్ళి, అక్కడ శిష్యులకు పాఠాలు చెప్పుతున్న మునిని చూశాడు. ఆయన శరీరం తపస్సుచేత కృశించి ఉన్నది. ఆయన జింకచర్మం మీద కూర్చుని ఉన్నాడు. ఆయన ముఖం ప్రశాంతంగా ఉన్నది. సురథుడు తన గుర్రాన్ని ఒక చెట్టుకు కట్టేసి, వెళ్ళి ముని ముందు సాష్టాంగపడి, కంటికీ, మంటికీ ఏకధారగా ఏడవసాగాడు.

ముని అతన్ని లేవనెత్తి, ఒక శిష్యుడి చేత జింకచర్మం తెప్పించి, దాని మీద అతన్ని కూర్చోమని, అతిథి మర్యాదలన్నీ జరిపించి, "నాయనా, నువు ఎక్కడినుంచి వస్తున్నావు? నీకు వచ్చిన కష్టమేమిటి? అంతా వివరంగా చెప్పు. నా దగ్గిరికి వచ్చినాక కూడా నీకు విచారం దేనికి? నీ మనసులోని కోరిక ఎంత కష్టసాధ్యమైనదైనా సరే, నేను దాన్ని తీర్చుతాను," అన్నాడు.

దానికి సురథుడు గద్గద స్వరంతో, "నేను సురథు డనే పేరుగల రాజును. శత్రువులకు ఓడి, మీ చరణసన్నిధిని శరణుకోరి వచ్చాను. నేను రాజ్యాన్నీ, భార్యనూ, పిల్లలనూ విడిచిపెట్టి ఈ అరణ్యంలో మీ చెంతకు చేరాను. మీరే నా కిప్పుడు తల్లీ, తండ్రీనూ! మీ సేవ చేస్తూ, మీరు చెప్పిన పనులన్నీ చేస్తాను. నిస్సహాయుడనై ఉన్న నాకు శత్రుభయం పోగొట్టి, నా వారివద్ద నన్ను చేర్చండి," అన్నాడు.

ముని అతనికి అభయం ఇస్తూ, "వనవృత్తి అవలంబించి, నీవారాన్నం తింటూ శుచివిగా ఉంటూ, హింసచెయ్యకుండా

మా ఆశ్రమంలో స్వేచ్ఛగా సంచరించు. క్రమంగా నీకు శుభాలన్నీ కలుగుతాయి." అన్నాడు.

సురథుడు ఈ మాటలకు సంతోషించి, తాను కూడా మునివృత్తి పూని, ఆశ్రమంలో ఉంటూ వచ్చాడు.

ఒక రోజున అతను చల్లని చెట్టు నీడను చేరి, తన ప్రయత్నం గాని, తప్పుగాని ఏమీలేకుండా తనకు సంప్రాప్తమైన కష్టాలను, అంటే రాజ్యం పోవటమూ, భార్యా, బిడ్డలూ ఎడబాటు కావటమూ, శత్రువుల చేతిలో ఓడిపోయి పరాభవం కలగటమూ మొదలైన వాటిని గురించి ఆలోచిస్తూం డగా ఒక వైశ్యుడు అక్కడికి వచ్చాడు. అతను అమిత దీనంగా ఉన్నట్టు కనబడ్డాడు.

సురథుడు ఆ వైశ్యుణ్ణి కూర్చోమని, "నువు ఎవరు? ఏం పని మీద ఇటుగా వచ్చావు? నీకు వచ్చిన కష్టం ఏమిటి?" అని అడిగాడు.

దానికి ఆ వైశ్యుడు, "నేను వైశ్యుణ్ణి, చాలా ధనవంతుణ్ణి, సత్యవ్రతంగలవాణ్ణి. దాతగానూ, ఔదార్యం గలవాడుగానూ పేరు తెచ్చుకున్నాను. ఎన్నడూ ఎలాటి కష్టమూ ఎరగను. అలాటివాణ్ణి నన్ను నా భార్యా, బిడ్డలూ ధనలోభంతో వెళ్ళగొట్టారు. ఈ అరణ్యంలో వచ్చి పడ్డాను.



నా పేరు సమాధి అంటారు. తమ కథ తెలుసుకోవచ్చునా? తమ ముఖం చూస్తే గొప్ప కళ స్ఫురిస్తున్నది," అన్నాడు.

"నా పేరు సురథుడు. నేను రాజును. శత్రువులకు చిక్కి దుర్మరణం పాలు కావటం ఇష్టంలేక, నీ లాగే ఈ అరణ్యానికి వచ్చాను. భాగ్యం పోయి, అభిమానాన్ని పోగొట్టుకుని, జడుడిలాగా ఇక్కడ సంచరిస్తున్నాను. దైవికంగా మన మిద్దరమూ ఇక్కడ కలుసుకున్నాం. కాబట్టి విచారాలు మాని, ఇక్కడే సుఖంగా ఉందాం," అన్నాడు సురథుడు.

దానికా వైశ్యుడు, "రాజా, నా మనసుకు శాంతి ఎక్కడిది? నాకు భార్యా



సుఖం దూరమయింది. నా కుటుంబానికి ఆధారం లేదు. నా కొడుకులు అప్రయోజకులు. నేను ఉప్పుకల్లు సైతం లేని గంజి కూడా తాగి కూడబెట్టిన సొమ్మంతా అలాములూ, పలాములూ చేసి దరిద్రులై పోతారన్న ఆరాటం నాకు శాంతి లేకుండా చేస్తున్నది. నేను ప్రాణాలతో మళ్ళీ వాళ్ళను చూస్తానో, లేదో!'' అంటూ కడవలకొద్దీ కన్నీరు కార్చుతూ ఏడ్చాడు.

అలా ఏడ్చే వైశ్యుణ్ణి చూసి సురథుడు, ''నిన్ను వెళ్ళగొట్టిన ఆ రాక్షసులను నువు మళ్ళీ చూస్తే మాత్రం నీకు ఏం సుఖం కలుగుతుంది? నేను కూడా రాజ్యం పోయిందే అని విచారిస్తూనే ఉంటాను. దైవికంగా వచ్చే కష్టాలు దాటాలంటే వాటిని అనుభవించవలసినదే. అయినా, ఇక్కడ ఉన్న మునిని అడిగి మనకు దుఃఖం తొలగే ఉపాయం ఉన్నదేమో తెలుసుకుందాం.'' అన్నాడు.

వైశ్యుడు అందుకు ఒప్పుకున్నాడు. ఇద్దరూ ముని వద్దకు వెళ్ళి, మొక్కి నిలబడ్డారు. అప్పుడు సురథుడు మునితో ఇలా అన్నాడు:

''ఇతనొక వైశ్యుడు. ఈ అరణ్యంలోనే నాకు మిత్రుడయాడు. ఈ పుణ్యాత్ముణ్ణి భార్యా, పిల్లలూ వెళ్ళగొట్టగా, ఇతను మీ పంచన శరణు పొందుదామని వచ్చాడు. నన్ను కాపాడిన విధంగానే, పాపం, ఇతన్ని కూడా కాపాడండి. మీ దయ వల్ల నేను ఇక్కడ సుఖంగానే కాలం వెళ్ళబుచ్చుతున్నాను. అయినా, నేను పడిన కష్టాలు మరపురాక, నాకు నిద్ర లేకుండా పోతున్నది. స్వామీ, మాయందు అనుగ్రహించి, మాకు శోకం లేకుండా పోయే మార్గం తెలపండి.''

ఈ మాటకు ముని, ''త్రిమూర్తులైనా మాయకు లోబడి, మోహసముద్రంలో పడి కొట్టుకుంటారన్నప్పుడు, మీ వంటి మానవమాత్రుల సంగతి అడగాలా? ఇందుకొక కథ చెబుతాను,'' అంటూ ఇలా చెప్పాడు:



పూర్వం కృతయుగంలో శ్వేతద్వీపంలో నారాయణుడు తపస్సు చేస్తూండగా, బ్రహ్మ మోహనివృత్తికోసం అక్కడే తపస్సు చేయసాగాడు. కొంతకాలానికి ఇద్దరూ తమ స్థానాలు విడిచి వస్తూ, ఒక చోట కలుసుకుని, నువ్వెవరు అంటే నువ్వెవరు అని ఒకరి నొకరు ప్రశ్నించుకున్నారు.

"నేను చరాచర ప్రపంచాన్నంతటికీ సృష్టి చేసినవాణ్ణి," అన్నాడు బ్రహ్మ.

ఆ మాట విని విష్ణువు, "జగత్తునంతా నేనే సృష్టించానని నా దగ్గిరా చెబుతావు? నువ్వనగా ఎంత? నేను విష్ణువును. ఈ సృష్టి అంతా నేను చేసినది. ఆనాడు నేను మధుకైటభులను చంపి నిన్ను కాపాడిన మాటకేం చెబుతావు? నువు వట్టి రాజసుడివి. ఎందుకు నీ కింత గర్వం? నేను నిన్ను పెంచి పెద్ద చేసిన సంగతీ, దానవులు నీ మీదికి వస్తే నువు బెదిరిపోయిన సంగతీ కూడా మరచి ఇలా మాట్లాడతావా?" అన్నాడు.

"నువు రాక్షసులతో యుద్ధం చేసేటప్పుడు నీకు జగదంబ సహాయం వచ్చిన మాట మరిచావా? ఎందుకీ బింకాలు?" అన్నాడు బ్రహ్మ.

ఇలా బ్రహ్మ, విష్ణువూ కీచులాడుకుంటూండగా వారికొక లింగం కానవచ్చింది. వారికి ఇలా మాటలు వినిపించాయి:

"ఓ నారాయణా! ఓ బ్రహ్మ! మీ వాగ్వాదం కట్టిపెట్టి, నేను చెప్పేది వినండి. ఈ శ్వేతదీపం మీద ఇప్పుడు పుట్టుకొచ్చిన లింగానికి ఒకరు చివరా, ఇంకొకరు మొదలూ చూసి, మీలో ఎవరు ముందు తిరిగి వస్తారో వారు మీ ఇద్దరిలోకీ గొప్పవాడు."

ఇద్దరూ ఇందుకు ఒప్పుకున్నారు. లింగంయొక్క మొదలు తెలుసుకునేటందుకు విష్ణువు పాతాళానికీ, దాని చివర చూసి రావటానికి బ్రహ్మ ఆకాశంలోకీ బయలుదేరారు.



విష్ణువు పాతాళంలోకి ఎంత లోతు వెళ్ళినా లింగానికి మొదలు కనిపించనే లేదు. దాని మొదలు తనకు కనిపించచ దేమోనన్న విచారం విష్ణువును బాధించ సాగింది.

అలాగే బ్రహ్మ ఆకాశంలోకి ఎంత ఎత్తు వెళ్ళినా లింగంయొక్క చివర కాన రాలేదు. బ్రహ్మకు ఎంతో సిగ్గూ, దుఃఖమూ కలిగాయి. అతను ఏం చెయ్యా టానికీ పాలుబోక ఒకచోట నిలిచి ఉండగా, పైనుంచి భూమి కేసి పడుతున్న ఒక మొగలిపువ్వు కనబడింది. బ్రహ్మ దాన్ని పట్టుకుని, పరమానందంతో విష్ణువు ఉన్న చోటికి వెళ్ళి, "నేను లింగం చివర చూసి వచ్చాను. అక్కడ ఉన్న ఈ మొగలి పువ్వును తెచ్చాను," అన్నాడు.

అప్పుడు విష్ణువు ఆ మొగలి పువ్వుతో, "ఈ బ్రహ్మ నిజంగా లింగం తలను చూశాడా? నిన్ను దేవతలు నిజంగా లింగం మీద దించారా?" అని అడిగాడు.

"అవును! నిజమే!" అని మొగలి పువ్వు విష్ణువుతో అబద్ధ మాడింది.

విష్ణువు దాని మాట నమ్మలేక, "లోకంలో అనేకమంది డబ్బుకోసం దొంగసాక్ష్యాలు చెబుతారు. ఈ విషయంలో శివుడి మాట తప్ప మరెవరిమాటా నేను నమ్మను!" అన్నాడు.

అప్పుడు లింగరూపం అంతర్ధాన మయింది. శివుడు విష్ణువుతో, "మొగలి అబద్ధ మాడింది. అది నాతల మీదినుంచి కిందపడుతూంటే, దారిలో బ్రహ్మ దాన్ని చూసి పట్టుకుని తీసుకువచ్చాడే గాని, అతను నా శిరస్సు చూసినవాడు కాడు." అన్నాడు.

అప్పుడే శివుడు మొగలిని తన పూజకు పనికిరానిదిగా శాపం పెట్టాడు. తరవాత బ్రహ్మ, విష్ణులు తమ దారిన తాము వెళ్ళారు.

ముని సురథుడికీ, సమాధి అనే పేరు గల వైశ్యుడికీ ఈ సంఘటన గురించి చెప్పి, ఇలా అన్నాడు:

"రాజా, మోహాన్ని ఎవరూ దాటలేరు. ఎంతో ప్రవీణులైనవారు కూడా మోహబద్ధులవుతారు. అలా మోహానికి అందనిది జగదంబ ఒక్కతే. ఆమె లక్షణాలు తెలుసుకున్నవారు మాత్రమే మోహసముద్రాన్ని దాటగలుగుతారు."

"మహాత్మా, ఆ లక్షణాలేవి?" అని సురథుడు మునిని అడిగాడు.

ముని ఇలా చెప్పాడు:

"అంబపూజ శుభప్రదం. అది అన్ని కోరికలూ తీర్చుతుంది. ఇది అశ్వయుజ మాసంలో జరిపే నవరాత్రవ్రతం. ఈ వ్రతాన్ని అశ్వయుజ, చైత్రమాసాలు రెండిటి ఆరంభంలోనూ తొమ్మిదేసి రోజులు చేయాలి. వ్రతం చేసేవాడు నిరాహారిగా, మంత్రాన్ని జపిస్తూ, నెయ్యీ, పాలూ, చక్కెరా కలిపిన పాయసంతోగాని, మేక మాంసంతోగాని, బిల్వపత్రాలతోగాని హోమం చేసి, బ్రాహ్మణ సంతర్పణ చెయ్యాలి. నవరాత్రపూజ చేసేవాడు జాతిభేదాలు పాటించరాదు, స్త్రీ పురుషభేదాలు పాటించరాదు. దేవీ పూజకు ఆరుకోణాలు గల యంత్రమూ, దాని పక్కన ఎనిమిది కోణాలుగల యంత్రాన్నీ రచించి, నవాక్షర బీజ మంత్రాలతో ప్రాణప్రతిష్ఠచేసి, మండలం మధ్యలో రాగిపాత్రను పెట్టాలి. దానికి



షోడశోపచార పూజలూ చెయ్యాలి. హోమమూ, హోమంలో పదోవంతు తర్పణమూ, తర్పణంలో పదోవంతు బ్రాహ్మణసంతర్పణ వగైరాలూ జరపాలి. పదవరోజున పారణ చెయ్యాలి. ఇలా చేసిన వారికి ఉత్తమలోకాలూ, దేవీ సహాయమూ లభిస్తాయి.

"రాజా, దేవీపూజకు సమమైనది మరొకటిలేదు. దేవిని అర్చించటం ద్వారా నీ బంధువుల నందరినీ తిరిగి కలుసుకుంటావు. ఓ వైశ్యోత్తమా, నువు కూడా దేవీపూజ చెయ్యి. నీ దుఃఖం ఉపశమించి, నువు తిరిగి ఎప్పటిలా ధనికుడవుతావు."

ముని చెప్పిన ఈ మాటకు ఆ ఇద్దరూ సంతోషించి, "మహాత్మా, తమ దయవల్ల మాకు మనోవ్యథ పోయింది. మాకు ఆ మంత్రం ఉపదేశించండి," అన్నారు.

ముని వారికి నవాక్షర మంత్రం బీజ సహితంగా ఉపదేశించాడు. వారు ముని వద్ద శలవు తీసుకుని, ఒక నదీతీరాన నిర్జనప్రదేశంలో ఆకులే ఆహారంగా రెండు సంవత్సరాలు మంత్రం జపించారు. ఒక నాడు కలలో వారికి దేవి ఎర్రని బట్టలు ధరించి కనిపించింది. అయినా వారు తపస్సు మానక, మూడో సంవత్సరమంతా జలమే ఆహారంగా గడిపారు. కాని దేవి సాక్షాత్కరించలేదు.

వాళ్ళు ఆత్మాహుతి కావటానికి నిశ్చయించుకుని, ఒక కుండం తవ్వి, అందులో అగ్నిరగిల్చి, తమ మాంసంకోసి అగ్నిలో వేల్చనారంభించే సరికి, దేవి వారికి ప్రత్యక్షమయింది.

"మీ సాహసానికి మెచ్చాను, వరం కోరండి," అన్నదామె.

సురథుడు, "తల్లీ, శత్రువులకు ఓడి, రాజ్యభ్రష్టుణ్ణి అయి పోయి, ఇంత కాలానికి నా పుణ్యం పండి నీ దర్శనం సంపాదించాను. నాకు నా రాజ్యం తిరిగి ఇప్పించి, నా కష్టాలు కడతేర్చు," అన్నాడు.

"నువు నీ శత్రువులను ఓడిస్తావు. నీ మంత్రులు నిన్ను కొలుస్తామని వస్తారు. నువు వెయ్యేళ్ళు సుఖంగా రాజ్యం చేస్తావు. నీకు మంచికాలం సమీపించింది," అని దేవి చెప్పింది.

సురథుడు అలాగే తన గుర్రం మీద తిరిగి వెళ్ళి, శత్రువులను జయించి, తిరిగి రాజ్యం ఏలుతూ, చివరకు దేవి సాయుజ్యం పొందాడు.

వైశ్యుడు మాత్రం, "తల్లీ, నాకు సిరి సంపదలు వద్దు. నాకు శాశ్వతమైన సుఖం కావాలి," అన్నాడు.

దేవి అతనికి దివ్యజ్ఞానం ఇచ్చింది. అతను జీవితాంతమూ నిస్సంగుడై తీర్థయాత్రలు చేసి, దేవి సాయుజ్యం పొందాడు.






ఒక దేశంలో ఒక ధనికుడైన వర్తకుడుండేవాడు. ఆయనకు ముగ్గురు కొడుకులు. చనిపోయే సమయంలో అతడు తన ముగ్గురు కొడుకులనూ చెంతకు పిలిచి, "నాయనలారా, నా కోసం యమదూతలు రాబోతున్నారు. నే నెంతో శ్రమపడి చాలా ఆస్తి గడించాను. ఆ ఆస్తిలోకల్లా విలువైనవి ఈ మూడు రత్నాలు. మీరు ఏ కారణం చేతనైనా వేరుపడదలిస్తే ఈ మూటినీ ముగ్గురూ తీసుకోండి. మూడూ ఒకే విలువ గలవి," అని చెప్పాడు.

ఆయన పోయాక కొద్దికాలానికి అన్నదమ్ములు వేర్లుపడదామని నిశ్చయించుకున్నారు. ఆస్తిలో ముఖ్యమైనవి రత్నాలు గనక వాటిని తలా ఒకటి తీసుకుందామని రత్నపేటిక తెరిచి చూసేసరికి అందులో రెండే రత్నాలున్నాయి. మూడవదాన్ని ఎవరో దొంగిలించారు. దొంగ ముగ్గురన్నదమ్ములలో ఒకడై వుండాలి. పరాయివాడు కావటానికి వీలులేదు.

"మనలో ఒకరు రత్నాన్ని హరించారు. మనం ఒకరినొకరు నిందించుకోవటం ఎంతమాత్రం భావ్యంగా వుండదు. రత్నాన్ని దొంగిలించినవాడు తన నేరం తాను ఒప్పుకోవటానికి బిడియపడవచ్చు. ఎవరికీ అవమానం జరగకుండా, ఎవరికీ అన్యాయం జరగకుండా రేపులోపల ఈ రత్నాన్ని తీసినవారు తిరిగి యథాస్థానంలో ఉంచేది," అన్నాడు పెద్దవాడు.

"లేని పక్షంలో ఏం చేయాలి?" అని అడిగాడు రెండోవాడు.

"ముగ్గురం వెళ్ళి రాజుగారికి ఫిర్యాదు చేద్దాం. నేరాన్ని నిరూపించే భారం రాజుగారిదే గదా?" అన్నాడు పెద్దవాడు.

"ఈ ఆలోచన చాలా బాగుంది." అన్నాడు మూడోవాడు.



మరొకరోజు గడిచింది. పోయిన రత్నం తిరిగిరాలేదు. ఆరోజే ముగ్గురన్నదమ్ములూ ప్రయాణమై రాజుగారి వద్దకు వెళ్ళి, జరిగినదంతా నివేదించి, తమలో దొంగ ఎవరో నిర్ణయించవలసిందని కోరారు.

ఈ కోరిక విని రాజు నివ్వెరపోయాడు. ఆయన ఈ ముగ్గురన్నదమ్ములనూ ఎరుగు!

"మీ తండ్రిగారు న్యాయవర్తనుడు. నాకు మిక్కిలి హితుడు. ఆయన కుమారులు నన్ను ఇలాటి కోరిక కోరటం సంతోషంగానూ, విచారంగానూ కూడా వున్నది. మీలో మీరు ఈ చిక్కు విప్పలేకనే నా దాకా వచ్చారు. కొద్దిరోజులలో మీ పని ముగిస్తాను. అంతదాకా మీరు పెదరాసి పెద్దమ్మ యింట బసచేసి వుండండి. మీకు కావలసిన సౌకర్యాలన్నీ నేను ఏర్పాటు చేయిస్తాను," అన్నాడు రాజు.

ముగ్గురన్నదమ్ములూ పెదరాసి పెద్దమ్మ యింట బసచేశారు. రోజులు గడవ సాగాయి. రాజు అహోరాత్రాలు ఈ సమస్యను గురించి ఆలోచిస్తున్నప్పటికీ విచారణ ఏ విధంగా ప్రారంభించాలో, ఎలా సాగించాలో ఎంతమాత్రమూ పాలుపోలేదు. ఒకరోజు రాజుగారు పెదరాసి పెద్దమ్మకు కబురుచేసి ఈ విధంగా అడిగాడు:

"పెద్దమ్మా, అతిథుల వల్ల నీ కేమీ ఇబ్బంది కలగటంలేదు కద!"

"లేదు, మహాప్రభూ! వాళ్ళు ముగ్గురూ ఎంతో మంచివాళ్ళు, ఎంతో పెద్దమనుషులు, మర్యాదస్తులు!" అన్నది పెద్దమ్మ.

"అందుకే ఎటూ పాలుపోవటంలేదు. ఆ ముగ్గురిలో ఒకడు సాహసం గల దొంగ!" అన్నాడు రాజు.

పెద్దమ్మ ఆశ్చర్యపోయి వివరాలడిగింది. రాజు దాచకుండా జరిగినదంతా చెప్పాడు.

"అయితే ఆ అన్నదమ్ములలో ఎవరు దొంగ అయినదీ నేను తెలుసుకుంటాను,

మహాప్రభూ! మీరు విచారించకండి!'' అన్నది పెద్దమ్మ.

ఆ రాత్రి పెద్దమ్మ వర్తకుడి కుమారులకు భోజనం పెడుతూ ఒక చిన్నకథ చెప్పింది. ఆ కథ యిదీ:

''అనగనగా సింహకేతుడని ఒక రాజు. ఆయనకు గుణవతి అని ఒకతే కుమార్తె. ఆమెకు యుక్తవయసు వచ్చేదాకా ఒక పండితుడి వద్ద విద్య నేర్పించారు. ఆమె కొరకు వివాహ ప్రయత్నాలు ఆరంభం కాగానే చదువు మాన్పించారు. ఒకనాడామె తన గురువు వద్దకు అనేక వస్త్రాలూ, ఆభరణాలూ, కొంత డబ్బూ తీసుకుని వెళ్ళి గురుదక్షిణ సమర్పించింది. కాని ఆ పండితుడు వాటిని ముట్టక, 'గురుదక్షిణ ఇవ్వదలచినట్టయితే, నీవు పెళ్ళాడి పరాధీనవయేలోపుగా ఒకరాత్రి నా వద్దకు సర్వాభరణాలు ధరించి ఒంటరిగా రావాలి!' అన్నాడు. గుణవతి సరేనని, వెళ్ళిపోయింది.

''తరవాత కొద్ది కాలానికే ఆమెకు వివాహమయింది. వివాహం జరిగిన రాత్రే భర్తతో తన గురుదక్షిణ గురించి చెప్పింది. భర్త, 'సరే, వెళ్లిరా!' అన్నాడు.

గుణవతి నగలన్నీ ధరించి గురువుగారింటికి పోతూండగా దారిలో ఆమెను ఒక దొంగవాడు అటకాయించి, నగలన్నీ ఇవ్వమన్నాడు. లేకపోతే చంపుతానని బెదిరించాడు. గుణవతి దొంగవాడితో తన గురుదక్షిణ గురించి చెప్పి,





తిరిగి వచ్చేటప్పుడు తన నగలన్నీ ఇస్తానన్నది.

దొంగ ఒప్పుకున్నాడు.

గుణవతి గురువుగారింటికి చేరుకున్నది. గురువుగారు తన శిష్యురాలి సత్యసంధతకు సంతోషించి, "తల్లీ! నేను చెప్పిన చదువు సార్థకం చేశావు. ఏమి ప్రమాదం రాబోయేదీ కూడా తెలియకుండానే అన్నమాట నిలబెట్టుకున్నావు. అదే నాకు సరి అయిన దక్షిణ. నీవు వెంటనే తిరిగివెళ్ళి నీ భర్తతో కలకాలం సుఖంగా కాపరం చెయ్యి." అని ఆమెను హృదయపూర్వకంగా ఆశీర్వదించాడు.

గుణవతి గురువుగారికి నమస్కారం చేసి తిరిగి వస్తూ, దారిలో తన కోసం వేచి వున్న దొంగను చూసి, "ఇవిగో, బాబూ! నా నగలిక నీవుపుచ్చుకోవచ్చు!" అన్నది.

ఈ మాటతో దొంగ హృదయం మారిపోయింది. వాడు గుణవతి కాళ్లపైబడి, "తల్లీ, క్షమించు. నీ వంటి వాళ్ళుండే ఈ ప్రపంచంలో నేను దొంగతనం చేసి బ్రతకలేను," అంటూ చీకటిలో ఎటో వెళ్ళిపోయాడు.

గుణవతి తిరిగి భర్త వద్దకు వచ్చి జరిగినదంతా చెప్పింది. భర్త చాలా సంతోషించాడు. వారిద్దరూ చాలా కాలం సుఖంగా కాపరం చేశారు.

పెద్దమ్మ చెప్పిన ఈ కథ విని వర్తకుడి ముగ్గురు కొడుకులూ చాలా ఆనందించారు.

"నా కొక్కటే సందేహం. ఈ కథలో చాలా మంది ఉదారులున్నారు, కాని అందరికన్న ఎవరి ఔదార్యం గొప్పది? ఈ సందేహం నన్ను చాలా కాలంగా పట్టి పీడిస్తోంది. నాయనలారా! మీరేమైనా నా అనుమానం తీర్చగలరా?" అని అడిగింది పెద్దమ్మ.

పెద్దవాడు కొంచెం ఆలోచించి, "వివాహమైన రాత్రే తన భార్యను గురువు

వద్దకు పోనిచ్చిన భర్త ఔదార్యం గొప్పది.'' అన్నాడు.

రెండవవాడు, ''అంతకన్న గురువు ఔదార్యం గొప్పది.'' అన్నాడు.

మూడవవాడు, ''చేతికి చిక్కిన రాజ కుమార్తె నగలను తీసుకోకుండా పోనిచ్చిన దొంగవాడి ఔదార్యం గొప్పది,'' అన్నాడు.

''భర్త యొక్క ఆగ్రహాన్నీ, గురువు గారి చేత అవమానాన్నీ, దొంగ యొక్క దురాశనూ ఎదుర్కొన్న గుణవతి ఔదార్యం మీలో ఒకరికీ నచ్చలేదా, నాయనా?'' అంటూ పెద్దమ్మ నవ్వేసింది.

ఆ రోజే పెద్దమ్మ రాజుగారి వద్దకు వెళ్ళి, ''మహాప్రభూ, మా యింట వున్న ముగ్గురు అన్నదమ్ములలోనూ నిశ్చయంగా దొంగ మూడవవాడే. తమరు విచారించి నిజం తెలుసుకోండి!'' అన్నది.

ఆమె ఊహకు కారణమేమని రాజు అడిగాడు పెద్దమ్మ జరిగినదంతా చెప్పి, ''ఆ కుర్రవాడు ధనలోభి కాని పక్షంలో దొంగ ఔదార్యాన్ని మెచ్చుకోడు.'' అన్నది.

రాజు పెద్దమ్మ చెప్పినదాంట్లో సత్య మున్నదని గ్రహించి, ఆమె తెలివితేట లకు ఆశ్చర్యపడ్డాడు.

మర్నాడు ఆయన ముగ్గురన్నదమ్ము లనూ పిలిపించాడు.

''రత్నపేటికలో వున్న రెండు రత్నా లను పెద్దవారిద్దరూ తీసుకోండి. అది న్యాయం!'' అన్నాడు రాజు.

మూడవవాడు అన్నల ముఖాలు చూడ లేక తల వంచుకున్నాడే గాని రాజు చెప్పిన న్యాయానికి విరుద్ధంగా చెప్పలేదు.

తరవాత ముగ్గురన్నదమ్ములూ ఇళ్లకు వెళ్ళిపోయారు. తండ్రి విడిచిపోయిన మిగతా ఆస్తిని కూడా సమంగా పంచు కున్నారు.

ఆ తరవాత వాళ్ళెన్నడూ రత్నం ఎవరు దొంగిలించారనే సంగతి మాట్లాడు కోలేదు. ఎంతో సోదర భావంతో కాలం గడిపారు.



# ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 25 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1980 మార్చి నెల సంచికలో ప్రకటింపబడును.



Devidas Kasbekar





Anant Desai

★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.)

★ జనవరి నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 25/–లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని ఇతర విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి :–చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు–26.

## నవంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : చాల వత్తులు

రెండవ ఫోటో : బాల బత్తులు

పంపినవారు : ఆర్. వి. శశికుమార్, No. 42, థర్డ్ స్ట్రీట్, అభిరామపురం, మద్రాసు–18

బహుమతి మొత్తం రు. 25/–ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 2 & 3, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor : NAGI REDDI.

"రాజుకు పాలు అంటే ఒకప్పుడు అయిష్టం... నేను న్యూట్రామూల్ కలిపి యిచ్చినప్పట్నించీ మహా యిష్టం"



# "మరిప్పుడు వాడు న్యూట్రామూల్ మొనగాడు"

పిల్లలు పాలు తాగటానికి మారాం చేస్తున్నారా? లేదు, అంటున్నారు రుచికరమైన న్యూట్రామూల్ కి దీవనలిచ్చే అసంఖ్యాకమైన తల్లులు. రుచికి రుచీ, బలానికి బలం, న్యూట్రామూల్ లో కోకో, పాలు, మాల్ట్ లతో పుష్టి వుంది—




బలే రుచి. మరి దీన్లో ప్రోటీన్లు, విటమిన్లు, ఖనిజాలూ వున్నాయి. పెరుగుతూన్న దశలోని శరీరానికి పుష్టినిచ్చేవి యివి. సువాసనతో నిండిన న్యూట్రామూల్ ప్రతి కప్పూ ఎంతో పోషణని యిస్తుంది.



మార్కెట్ చేయువారు :
గుజరాత్ కో-ఆపరేటివ్
మిల్క్ మార్కెటింగ్
ఫెడరేషన్ లిమిటెడ్
ఆనంద్, గుజరాత్

అమూల్

## న్యూట్రామూల్ ప్రతి కప్పు మీకు పోషణను ఇచ్చు!

daCunha-GCM-16 TL

69

70

# రాజు బ్రష్‌లేకుండా రంగులు వేసాడు

రాజు ఉత్త అల్లరి పిల్లాడు. అతనికి రంగులు వేయడం అంటే సరదాయే. అయితే గిన్నెలోని నీళ్ళంతా ఒలక పోసి, ఇంట్లో నేలంతా పాడుచేసి, చేతులనిండా బట్టలనిండా రంగు పులుముకునేవాడు. అలాంటి పనులు చేస్తూంటే ఏ అమ్మ మాత్రం ఊరుకుంటుంది.

"నువ్వింక రంగులు వేస్తే ఊరుకోను" అంది వాళ్ళ అమ్మ. మోహన్‌కి రాజుని చూస్తే జాలేసింది పాపం. అతను రాజుకి తన వ్యాక్స్ క్రేయాన్స్, ఆయిల్ పేస్టల్స్ బాక్స్‌లు చూపించాడు. నీళ్ళతో పని లేదు, బ్రష్ అక్కర్లేదు, తుళ్ళి దిందర వందర అవుతుందన్న బాధ లేదని చెప్పాడు.

అలా బాక్స్‌లోంచి పేస్టల్స్ తీసుకొని ఇలా రంగులు వేయడం మొదలెట్టడమే— అమ్మోయ్ ఎన్నెన్ని రంగులు— ప్యారట్ గ్రీన్, లాబ్‌స్టర్ ఆరెంజ్, పీకాక్ బ్లూ, సన్‌ఫ్లవర్ ఎల్లో— ఇంకా ఎన్నెన్నో రంగులు.

ఇప్పుడు రాజు వాళ్ళ అమ్మకూడా రాజు కోసం క్రేయాన్స్ బాక్స్ కొంది.



## కేమెల్

ఆయిల్ పేస్టల్స్

ఇది 12, 24, 48 షేడ్స్‌లో కూడా దొరుకుతుంది.




కేమ్లిన్ ప్రైవేట్ లిమిటెడ్
ఆర్ట్ మెటీరియల్స్ డివిజన్
జె. బి. నగర్,
బొంబాయి 400 059.



కేమ్లిన్ అన్‌బ్రేకబుల్ పెన్సిళ్ళ ఉత్పాదకులనుండి



**Results of Chandamama—Camlin Colouring Contest No. 11 (Telugu)** VISION 792 TEL

*1st Prize:* T. Radhika, Kakinada. *2nd Prize:* B. Satish VI C, Vizag-1. *3rd Prize:* D. Anand, Hyderabad. *Consolation Prizes:* B. Sarada, Mori-533 250; G. Nagaraju, Nellore; A. Nivedita, Secunderabad-3; Y. N. Sreenivas, Hyderabad; M. D. Zakeerhussain, Adilabad.

CHANDAMAMA (Telugu) JANUARY 1980 Regd. No. M. 4854

# పిల్లల్నేమో లాలించాలి, లాలిస్తే ఏపుగా పెరుగుతారు




ప్రీతితో యిచ్చేది
**పార్లే గ్లూకో**
**మజా రుచితో**
**ఎంతో శక్తితో**

పాలు, గోధుమలు, పంచదార, గ్లూకోజ్ మజా రుచులతో నిండి, పుష్టి నిచ్చే లక్షణాలు గలది.



వరల్డ్ సెలక్షన్
బహుమతిని గెలుచుకున్నది




భారతదేశంలో అత్యధికంగా అమ్మబడే బిస్కట్

everest/79/PP/159-tl